శ్రీ

# భారతాభ్యుదయము

## (శ్రీవిద్యారణ్యచరిత్రము)

యక్షగానము

卐


గ్రంథకర్త:

భీమవరపు సాంబశివశర్మ





ప్రకాశకులు:

**శ్రీ రామా బుక్ డిపో**

మార్కెటువీధి, సికింద్రాబాదు.

卐

"దివ్యవాణి" పత్రికవారి

శ్రీనివాస ప్రింటింగ్ వర్క్సునందు ముద్రితము, సికింద్రాబాద్.

**1945**




వెల: 0-8-0

శ్రీ శివాయనమః

# పరిచయము.

ధర్మరంజన వంగపల్లి-నీలకంఠంగారు.

శ్రీ సనాతన ధర్మ మహాసభ కార్యదర్శి (సికింద్రాబాద్)

ఈ గ్రంథరాజమొక గేయకావ్యము. దీనిని రచించిన శ్రీ సాంబశివశర్మగారు వయసున జిన్నవారు, వాక్పటిమయందును పాండిత్యమునందును దొడ్డవారు.

పూజ్యపాదులును సర్వతంత్ర స్వతంత్రులును, సర్వజ్ఞేత్యాది బిరుదాంచితులును నగు శ్రీ శ్రీ విద్యారణ్యస్వామివారి మహామహిమోపేతంబగు ధర్మనిర్వహణత్వము, ధీరోదాత్తలక్షణము, రాజ్యపాలన చతురత మున్నగు వానిని సామాన్య జనులకు సహితము బోధపడునట్లు సంగ్రహముగ రచియించి, భాషకు నూతన వికాసమును సేకూర్చినారు. ఇంతియేగాక అనంతవిశ్వ కల్యాణకాకరమగు ఆర్యసాంప్రదాయ విజ్ఞాన వైభవమును, ధర్మసిద్ధాంతములను, భారతీయ సభ్యతను మిక్కిలి సమదృష్టితో సమర్థించుటలో జేసినకృషి, అపారమును ప్రశంసార్హమునై యున్నది.

భాష పరిశుద్ధముగ నుండుటయేగాక సర్వజన సువేద్యముగ నున్నకారణమున నీ గ్రంథరాజము సర్వాంధ్ర విద్యాలయములందు, పఠనాలయములందు, బాహ్యతాభాగ్యము బడయ గలదని విశ్వసించుచున్నాడను.

ధర్మగ్లాని యధికమైయున్న యీవిషమ సమయమున ధార్మికుడు కాదలచిన ప్రతిఆంధ్రుని హస్తమునకు నిది యొక గొప్ప యలంకారమై శోభిల్లగలదు.

తనకొఱకును, సంఘము కొరకును, ఐహికాముష్మికార్థ సంపాదనకయి అవలంబింపవలసిన నీతులన్నియు నీగ్రంథములో వివరింపబడియున్న కారణమున జదివి యానందించుట తో విరమింపక అనుష్ఠించుట కర్తవ్యము, శ్రేయోదాయకమని పాఠకలోకమునకు మనవి.

ప్రాచీన విజ్ఞానమునకు లేమివాటిల్ల ధర్మాధర్మ విచక్షణాశూన్యమగు ఈ దుష్కాలములో స్వధర్మానుష్ఠాన సమస్యలను ప్రజల కెఱుకపరచుటకై యిట్టి ధర్మప్రబోధ గ్రంథ ముద్రణరీత్యా సర్వశక్తుల సహాయపడుచున్న శ్రీ రామా బుక్ డిపో (సికింద్రాబాద్) వారి యుద్యమము సర్వతోముఖముగ వ్యాప్తినొంది పరమేశ్వరుని కృపచే నానాట వర్ధిల్లుగాక!

---

# పండిత ప్రముఖుల అభిప్రాయములు

(బ-వెంకటేశ్వర గుప్తగారు, హైకోర్టు వకీలు. సదాశివపేట్)

వైదిక ధర్మాభిమానులై, సనాతనధర్మ తత్వముల వివరించు గ్రంథముల ప్రసరింప జేయుచున్న శ్రీయుతులు పచ్చా శంకరయ్య శ్రేష్ఠిగారు తమ పుత్రికా జన్మోత్సవ సందర్భమున శ్రీ విద్యారణ్యానుచరిత్ర సిహాత్తము నచ్చొత్తింపజేసిర-

ఆధునిక విద్యాధికులు కొందరు మన వైదికధర్మ ప్రాశస్త్యమును, పూర్వుల వైదుష్యమును గుర్తెరుంగని కారణమున అన్యదేశ వేషభాషాచార వ్యామోహితులై, నవ్యావిద్యే తరుణోపాయంబులని భావించి, పామర జనులలో సైతము "బుర్రకధల" రూపమున స్వమతములను వ్యాప్తి జేయుచు హైందవజాతికి హానికలిగించుచున్నారు. వారి ప్రబోధనము లోని నెరసులనేరి వాటిని సహేతుకముగ ఖండించుచు అల్పజ్ఞులకు సహిత మర్థమగునట్లు తేటతెల్లముగ తేనెలొలుకు పలుకులచే హైందవ ధర్మముల నిజస్వరూప మీగ్రంధమున "బుర్రకధ" సరణిని చిత్రింపబడినది.

ఈగ్రంధము ధర్మప్రచారమునకు కొంతవరకు తోడ్పడ గలదని భావించుచు దీనికి ప్రజాసామాన్యములో వ్యాప్తి గలిగింప జేయవలయునని ధర్మప్రచార తత్పరులను కోరుచున్నాను. శ్రీయుత సాంబశివశర్మగారివలె తదితర పండితులు ప్రబోధ గీతములను ప్రజల కందించగలరని యాశించుచున్నాను.

---

శ్రీ శిర్నాం సత్యనారాయణ గుప్తగారు.

శ్రీ విద్యారణ్యచరితము" అను గ్రంధమును బహువ్యాపకత్వముచే సంపూర్ణముగ జదువలేకపోతిని. స్థాలీపులాక న్యాయముగ నందందు జూచితిని. కవిత్వము సరళమై కదళీ పాకమువోలె పండిత పామర జనరంజకమై యొప్పుచున్నది. కైకొనిన యితివృత్తము మహర్షి శ్రీవిద్యారణ్య స్వామివారిది-

ఇట్టి మహాత్ముల చరిత్ర స్త్రీ బాల వృద్ధులకు పండిత పామరుల కందుబాటులో నుండి ప్రజాహృదయంబు నాకర్షింప జాలిన, తందనాన పాటలలో వ్రాయుట ఆధునిక వాతావరణము ననుసరించి శ్రీసాంబశివశర్మగా రొనరించిన యుత్తమ కృషి.

వీరితోధికముగా భాషాసేవ తన్మూలమున దేశసేవ యొనర్పగల శక్తి పరమేశ్వరు డతని కనుగ్రహించుగాక-

ఈ చిఱుపొత్తము ప్రజాదరణము నొందునని ఆశించు చున్నాడను-

---

నాగం కృష్ణారావుగారు (సికిందారాబాదు)

బ్ర॥ శ్రీ॥ సాంబశివశర్మగారిచే రచింపఁబడిన భారతాభ్యుదయమను నామాంతరముఁ గల "శ్రీ విద్యారణ్య చరిత్ర" మను వీధిరూపకమును జదివినాఁడను పూర్వకాలమున నాంధ్ర దేశమునందుఁ బ్రజలలో సులభముగా ధర్మమును శౌర్యమును, దేశాభిమానమును బురికొల్పుటకై జంగం కథలు, యక్షగానములు మొదలగు కృతులు విరివిగ రచింపఁబడి, ప్రదర్శింపఁబడుచుండినవి. పాశ్చాత్య విద్యాభ్యాసమువలనను తదనుకరణము వలనను గ్రమక్రమముగా దేశజులందు స్వధర్మ స్వభాషా స్వవేషాదులం దాదరాభిమానంబులు సన్నగిల్లి వర్ణాశ్రమ ధర్మబద్ధమగు హిందూసంఘమును గుంకుటె వ్రేళ్ళతోఁ బెళ్ళ

గించుటకు వలయు నధార్మిక ప్రయత్నంబు లవ్వారిగ ప్రస్తు
తము మనదేశమందు జరుగుచుండుట ప్రాజ్ఞలోకంబునకు విది
తంబైయున్నది. అమాయికులగు ప్రజలకు, దమ యుద్దేశము
లను బోధించి వారిని దమ వైపునకుఁ ద్రిప్పివేయుటకై ప్రయ
త్నించుచు ఐకమత్యమనియు స్వరాజ్య సంపాదనమనియు
వేషములు వైచుకొని కొందఱు మహనీయులు ధర్మవిధ్వంసకు
లని లోకప్రసిద్ధిగన్న మహాత్ముల చారిత్రములకు జంగం(బుడ్డ)
కథలుగ మార్చి దన్మ్యాలమున ప్రచారముఁ గావించుచు సంఘ
మునందు లేనిపోని కలతలను గలిగించుచు ద్వేషానలనము రగు
ల్కొల్పుచు హిందూసంఘమును నధోగతికిఁ దెచ్చుచున్నారు.
ఇట్టి పట్టున, హిందూసంఘమును బ్రబలులగు పై అంతశ్శత్రు
వుల బారినుండి సర్వవిధముల సంరక్షించుకొనుట వర్ణాశ్రమ
ధర్మబద్ధులగు హిందు మహాజనుల ప్రధానకర్తవ్యమై యున్నది.
దానికై యీగ్రంథమును రచించిన బ్ర॥ శ్రీ॥ సాంబశివశర్మ
గారును. తత్కృతికిఁ బ్రోత్సాహ మిచ్చినవారును, దానిని
ముద్రింపించి ప్రచారమునకై కంకణముఁ గట్టుకొనిన మ. రా
రా శ్రీ పబ్బా శంకరయ్య శ్రేష్ఠిగారును మిగుల గణనీయులని
జెప్పవచ్చును గ్రంథమునందలి భాష సులభశైలినిఁ గలిగినదై
పండిత పామర హృద్యంబగుచు, దేశాభ్యుదయకరంబుగ
నున్నదని జెప్పుట సాహసము కానేరదని నాయభిప్రాయము.
ధర్మరక్షకుఁడగు పరమేశ్వరుఁడు కృతికర్తకును, గృదిభర్తకును
శ్రేయస్సుల నొసంగుగాత! ధర్మఏవ హతోహంతి, ధర్మో
రక్షతి రక్షితః॥ సత్యమేవ జయతి. నానృతం. ఇతిశివం.

శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రి గారు దివ్యవాణీ పత్రికాధిపతులు.

---

మ॥ సదయాంతఃకరణంబుతో నిడినయుష్మత్ప్రోక్త మాభారతా
భ్యుదయాఖ్యాకృతిసాంతముం జదివి సంపూర్ణప్రమోదంబుతో
"అది ధర్మార్థ సమర్థకం లఘు విద్యారణ్య జీవత్కథా
విదితంబుం గృతినుత్యమంచు ననెదం భీ॥ సాంబశర్మాభిధా॥

ఉ॥ మీ కృతినిం మనోజ్ఞముగ మేదుర ధర్మరతుండు సత్కృతి
ప్రాకటికుండు నూరుజుఁడు పబ్బతులోదిత శంకరుండు ము
దాకృతి జేసి నూతనుల యాగడముం గడతేఱ ధర్మముల్
సాకగ వెల్లడించెగద సాంబశివా! జననుత్యమానటుల్

తే-గీ॥ శంకరుఁడగు సాంబశివుఁడు సత్కృతులను
వెల్లడించుచు నల్లడల్ వినుతిగ నేడి
సాంబశివ శర్మకును పబ్బ శంకరయకు
సకల భోగభాగ్యములిడి సాకుగాత॥

సహజకవి బ్ర॥శ్రీ నారాయణం రాజనరసింహంశాస్త్రిగారు.

సుకవివర్యా!

కం॥ విద్యారణ్య చరిత్రము
హృద్యముగా గాయనమున కెంతయుసుమనో
వేద్యముగ గూర్చి జగతిని
సద్యశమును గాంచినారు సాంబశివ కవీ॥

కం॥ పబ్బా శంకరుఁడిడె నను
టబ్బురమా ముద్రణమున కథఁ జిచికెనో
కబ్బముల కీయ దలచెడి
నిబ్బరముగ లట్టినీతి నిపుణుఁడగుటన్॥

కం॥ అప్పయశాస్త్రుల యనుమతి
దప్పక రచియించి వివిధ ధర్మముల రసం
బుప్పతిల జేయకృతులను
మెప్పుగొనుట యాస్తికుల కమేయముదముగన్॥

---

# దివ్యవాణి

సచిత్రాంధ్ర వార వార్తాపత్రిక.

సంపాదకులు: చివుకుల అప్పయ్యాశాస్త్రి

ఇమాంబావీధి, శికిందాబాదు.

సంవత్సరచందా 3-0-0 కల్దారు.

,, 3-8-0 హాలీ.

# మనవి



"యం పృథగ్ధర్మచరణాః పృథగ్ధర్మఫలైషిణః
పృథగ్ధర్మైస్సమర్చంతి తస్మై ధర్మాత్మనే నమః॥

భారతమొక దేశమాత్రమే కాదు,— ఖండము, ఛాల్డియను, చైనీస్, ఈజిప్షియను, బాబిలోనియను గ్రీక్, రోమన్ మున్నగు ప్రాచీన నాగరికత లన్నిటికంటె ప్రాచీనతమమగు నాగరికత కాలవాలమై, భిన్న భిన్న భాషలు భిన్నభిన్న ప్రకృతులు గల మన భారతఖండమును కోట్లకొలది వత్సరములు ఏకమత్యముతో సజీవముగానుంచి, దేశీయులయొక్కయు విదేశీయులయొక్కయు మన్ననల నందిన ప్రధాన వ్యవస్థ శ్రుతి స్మృతిబోధితమగు వర్ణాశ్రమధర్మమే. ఈ సనాతనధర్మమందవిరళముగా నమరియున్న యాధ్యాత్మిక దృక్పథమే ఐహికవాంఛానల దందహ్యమానమగుచున్న ఆధునిక ప్రపంచమునకు ఏనాటికైనను అమృతసేచనము చేయగలదు. ఈ మార్గము గ్రహింపక ప్రపంచవాహినిలో కొట్టుకొనిపోవుచు తమతో పాటితరులనుకూడ లాగికొనిపోవుచున్న పాశ్చాత్యానుకరణ ప్రియుల దుష్ప్రచారముల నరికట్టి, భారతీయులకు స్వస్వరూపజ్ఞానమును సంబోధించు టెంతయు ముఖ్యావసరమై యున్నది. అట్టి ప్రయత్నపారావారమున నీ చిన్నిపొత్తమొక యల్పశరీరము.

స్వధర్మమడుగంటుటను సహింపజాలక, విద్యానగర సామ్రాజ్య స్థాపనము జేసి దేశోద్ధారణ మొనర్చినట్టి శ్రీ విద్యా

రణ్యాయతీందుల చారిత్రమును అవసరమైనంతవరకు ప్రాతిపదికగా గ్రహించి, భారతధర్మస్థితి ఈగ్రంథమున వర్ణింపబడినది. భారతాభ్యుదయమునకై వర్ణాశ్రమాచారప్రయుక్తమగు సనాతనధర్మమే సర్వసమర్థమై, వాంఛనీయమైయున్నదని చెప్పుటయే యీ గ్రంథప్రయోజనము. ఇందులకై సాక్షాచ్ఛంకరావతారులగు శ్రీ విద్యారణ్యుల జీవితచరిత్రమందలి ప్రధానఘట్టము దృష్టాంతముగా ప్రరోచనార్థమై గ్రహించబడినది. జనరంజనము కొఱకై ఆధునిక ప్రచలిత పద్ధతిననుసరించి ఇది గేయరూపమున (జంగముకథగా) రచింపబడినది. ఇదియే నా ప్రధాన ప్రయత్నమగుటచే ఇందుగల నొసులను మన్నింప సరసులు సమర్థులని వేరే చెప్పనక్కరయుండదు.

ఈ గ్రంథమునందు భారత ధర్మోత్కృష్ట్య చారిత్రమును వర్ణించుటయేగాని రాజకీయాన్యమతాది నిరసనమెంతమాత్రము నుద్దేశింపబడలేదు.

ఈకాగితపు కఱవులో నీగ్రంథ ప్రకాశభారమునువహించి నన్ను ప్రోత్సహించినట్టి శ్రీరామాబుక్ డిపో ప్రొప్రైటరులగు, యశఃకాయ శ్రీ చందారామన్న శ్రేష్ఠిగారి మేనల్లుడును అగు శ్రీ పబ్బాశంకరయ్య శ్రేష్ఠిగారి ధర్మప్రీతిని నేనెంతయుకృతజ్ఞతతో ప్రశంసించుచున్నాను. ఈ గ్రంథరచన కన్నివిధముల ... ప్రోత్సహించి, చేదోడు వాదోడుగా నుండిన "దివ్య

వాణీ పత్రికాధిపతులగు మహాకవి, శిరోమణి శ్రీ చిప్పకుల అప్పయ్యశాస్త్రి గారికిని, శ్రీ నాగం కృష్ణారావుపంతులగారికిని, శ్రీ నీలా రాజయ్యగుప్త గారికిని అడిగినంతనే శ్రమయనక పరిచయవాత్యములను వ్రాసియిచ్చిన ధర్మరంజన శ్రీ వంగపల్లి నీలకంఠం శాస్త్రిగారికిని నేనెంతయు కృతజ్ఞుడను.

ఇట్లు

భీమవరపు సాంబశివశాస్త్రి



శ్రీ పరమేశ్వరాయనమః

# శ్రీ విద్యారణ్య చరితము

---


రామాహ్వాన్నిరజమిత్రుని-చిత్తమందు దలచి,
హేరంబుని శారదాంబను నుతి-యించి హనుమగొలిచి
ఆదికవిని వాల్మీకిమునిన్, వ్యా-సాదులస్తుతియించి,
ఆదరమున నన్నయతిక్కనము-ఖ్యాంధ్రకవులనెంచి

భావపరతంత్రలౌకికవులనో- రావలింపజేసి,
సేవచింతు భారతధర్మస్థితి - నేర్చినంతవాసి,
అందున శ్రీవిద్యారణ్యులచరి తామృతమ్ము వినుడీ,
సనాతనధర్మిష్ఠులార! యో - సభ్యలోకులారా!
అనూనసుగుణానిత్యులారా! యో- హైందవజనులారా!
శ్రీవిద్యారణ్యయతీంద్రులచా-రిత్రము వినరండీ
వైవిధములనా మహానుభావుని-వినుతింపగరండీ
తపసులలోన తాపసియాచు-ధన్యుడైనవాడు
లౌకికులందున లౌకికుడై, యలౌకికుడైనాడు,
అఖిలభారత దేశమందున-ఖ్యాతిగాంచినాడు
నిఖిల హైందవులకాదర్శుండై-నెగడుచుండినాడు,
అదియిదియనకను అన్నిశాస్త్రముల-నారితేరినాడు,
వందకుపైగా గ్రంథంబులను-వ్రాసినట్టివాడు,
భారతదేశపు పారతంత్ర్యముఁ-బాపబూనినాడు,

భారతీయుల పాట్లనుతీర్పగ-పాటుపడినవాడు,
విజయనగరసామ్రాజ్యంబునకు-బీజభూతుడతడు
నిజతేజంబున మ్లేచ్ఛులనావల-నెట్టివేసినాడు,
ప్లాటుఫారం లెక్చర్లతో తృప్తి-పడినవాడు గాడు,
దేశసేవయన యిట్టిదటంచును-చేసిచూపినాడు,
మన దేశంబున నట్టివాడుతర-మున కొక్కండైనా
కలిగినచో మన భాగ్యమునకు మేర-కలదే ధరలోన?
అట్టిమహానుభావునిచరితము-నవధరింపరండీ
నెట్టననాయన సద్బోధనలను-నెరవేర్పగలెండీ॥
ఆవిద్యారణ్య యతీంద్రాదులు-అవతరించినట్టి
శ్రీమద్భారతదేశమాహాత్మ్యము-చెప్పెదవినరండీ॥
అయ్యో! మనభారతఖండమువంటిదీ - యవనిలో నేలేదు
వినుడీ! మనభారతఖండమువంటిదీ-పృథ్విలో నేలేదు,
అనుపమానమనిచెప్పినచో నది-అతిశయోక్తి కాదు,
వైకుంఠధామమనిఘనమాహే-ర్వడ్డగడ్డయండీ,
లోకములకు నాయకమణియనదగు-లోకమిద్దియండీ,
సకలశాస్త్రములకున్ భారతదే-శమ్మెపుట్టినిల్లు,
సకలనాగరికతలకున్ జన్మ-స్థానమిద్దిపెల్లు
తక్కినదేశము లన్నియుజీవము-దక్కియున్ననాడు,
ఉక్కుమిగిలినిజతేజమునింపెను-దిక్కులనీనాడు,
జగమంతట నేకచ్ఛత్రాధిపత్యము-సాగించినదండీ వహ్వా!
అగుపించును నేటికి నాచిహ్నెలు-అమెరికాలోనుండీ॥తం॥

దేశ దేశముల వర్తకమెంతో - వాసి గాంచెనండీ భళిరే,
రాసులు రాసులు రత్నాల్ బంగా - రమ్మె నిండెనండీ ॥తం॥
చక్కని యమృతము ప్రవహించేటి - పెక్కు నదులతోడ,
మిక్కుటమైన పాడి పంటలకు - మేటియైనవాడ;
అన్నవస్త్రములకు నుత అచుగకఉ - వన్నమాటే లేదు,
పున్నెమున్నచో భారతభూమినె - పుట్టగపోరాదు ॥తం॥
పర దేశస్థుల నోరూరించే - వాతావరణమ్ము, భళిరే
సురలకునైనా జనన యోగ్యమై - పరగెడి దేశమ్ము ॥తం॥
దానధర్మములు, శాంతి దాంతి భార - తాంబదే యా సొమ్ము
జ్ఞానగు పరతత్వవివేకమునకు - జన్మస్థానమ్ము ॥తం॥
ఆదిగ్రంథములౌ శృతిస్మృతుల - కాలయమా భూమి
కోట్లకొలది వత్సరముల ప్రాయపు - గొప్ప భూమియండీ ॥
పాణిని నన్నయలను పోలిన బుధ - పాళికాటపట్టు,
వ్యాస వాల్మీకి ముఖ్యమునివరుల - కాయతనంబిద్ది,
కాళిదాసు తిక్కనలను బోలిన - కవులకు నికిపట్టు
శంకర రామానుజ మధ్వాద్యా - చార్య జన్మభూమి;
భోజ శ్రీకృష్ణదేవ రాయాది - పుడమిపతుల గీము,
త్యాగరాజును పోని సంగీత - తత్వజ్ఞులకిక్క
పోతరాజును పోలిన సహజక - వులకు నిలయమండీ,
రామదాసువంటి భక్తవరులకు - ప్రాణమైన తావు,
రామకృష్ణునివంటి జ్ఞానులకు - రంగభూమియండీ,
వివేకానంద స్వామిని పోలిన - మహామహులతావు,

పృథ్వీ రాజ శివాజీలవంటి-వీరులకాకరము;
సమర్థ రామదాసువంటిగురు-చరణులనిలయమ్ము
పాముల నరసయ్యగారివంటి-మంత్రిజ్ఞులకిరవు,
ఎల్లలుః హిమవత్పర్వత రాజము—హిందూమహాజలధి
భాష సమస్తభాషాజననియగు దేవ-భాష సంస్కృతమ్ము
శాకుంతల పాతంజలి మహాభాష్య-సద్గ్రంథాలయము,
రామాయణ మహాభారత భాగవత-గ్రంథములకుజనని,
దశాంశమానముకనిపెట్టినదీ-ధన్య దేశమండీ,
ప్రసిద్ధిగన్నఢక్కా—మజ్లిను-బట్టలపుట్టిల్లు,
ఈవిధముగ మనదే.

ఇట్లుమన దేశమెన్నో విధముల-ఎన్నికగన్నాది,
ఇట్టిభారతావనికిపరకీయు-లేగుదెంచినారు,
అధర్మయుద్ధాలతో రాజ్యముల-నాక్రమించినారు,
ప్రజలనందరను కొల్లగొట్టుచు-బాధపెట్టినారు,
హిందూమత దేవళముల పైధ్వజ-మెత్తివచ్చినారు,
గోగణములను క్రూరముగాను-కోసిచంపినారు,
కాలవశమున హిందూరాజుల-ఘనతసన్నగిల్లె,
వారిలోవారికి ఐకమత్యము-పలుచనయ్యెచాల,
వారికితగిన నాయకుడెవడు-ప్రాప్తింపగలేదు,
ఉత్తరహిందూస్థానమంతయు-ఉద్వాసనయయ్యె,
క్రమక్రమముగా దక్షిణాపథము-కర్మముమూడినది,
కాకతిరాజుల విక్రమజ్వాల-కాకతరిగిపోయె,
కాకతీయసామ్రాజ్యపుదినములు -గడచిపోయెనండి,

ఓరుగల్లునకు రాజధానియగు-యోగ్యతపోయినది,
చపలచిత్తయనుమాటలక్ష్మికి-సార్థకమేయయ్యె
కాకతివీరులకు నిలువనీడయె-కానరాకపోయె,
క్రమక్రమముగా పరరాజ్యములకు-కదలిపోయినారు,
హరిహరరాయలు బుక్కరాయలు-అన్నదమ్ములండి,
కాకతిరాజ్యపు కోశాధ్యక్షులు-ఘనమైనవారు,
ఆంధ్రరాజ్యపుదుస్థితిచూచి-ఆర్తిచెందినారు,
తామరాకులో నీటిమాదిరి-తల్లడిల్లినారు,
చేయగలిగినది ఏమియులేక-చింతబొందినారు,
అంతటవారు పయనంబయిరి-ఆనెగొందికేను
ఆనెగొందిసంస్థానాధీశ్వరు-నాశ్రయించినారు
జంబుకేశ్వరుండను పేరివాడు-సంస్థానాధిపతి,
ఇతడు వీరిప్రజ్ఞావిశేషమున-కబ్బురపడినాడు.
వీరినిద్దరను తనకుమంత్రులుగ-కోరిచేసినాడు,
హరిహరరాయలు బుక్కరాయలును-ఆనెగొందిలోను
స్వామిభక్తితో రాజ్యపాలనము-సాగించినారు
ఇంతటిలోనే మరియొకబెడద-ఏగుదెంచెనండి,
రాగలశని రామేశ్వరమేగిన-రాకపోదుసుండి,
మహమ్మదుబినుతుగ్లకనేవాడు ||తం||
ఢిల్లీలోనుపాదుషాగనుండె ,,
ఆతనిమేనల్లుడు బాహుద్దీను ,,
అతనికర్మము బాగుండలేదు ,,
బాద్షాతోను వైరముకలిగింది ,,

బాద్షావద్దనుండలేకపోయె ,,
అంతటనాతడు పారిపోయెనండీ ,,
ఆనెగొందికి వచ్చిచేరినాడు ,,
మరియెవరతనికి దిక్కుతోచలేదు ,,
జంబుకేశ్వరుని శరణుజొచ్చినాడు ,,
నీవెనన్ను గావ తగువాడనన్నాడు ,,
నీవెతప్ప వేరె గతిలేదన్నాడు ,,
తోడనేజంబుకేశ్వరుడుచూచినాడు ,,
అభయంబిచ్చితి వెరువకుమన్నాడు ,,
సూర్యచంద్రుల సాక్షిగనన్నాడు ,,
నీప్రాణము నాప్రాణమె యన్నాడు ,,
యుద్ధముకైనా వెనుదీయనన్నాడు ,,
హరిహరుడుబుక్కుడు ఆమోదించారు ,,
శరణాగత రక్షణమెముఖ్యమనిరి ,,
సేనలన్నిటి సిద్ధముచేశారు ,,
హిందూరాజుల ధర్మముచూడండి ,,
హిందూరాజుల త్యాగముచూడండి ,,
హిందూరాజుల ధైర్యముచూడండి ,,
హిందూరాజుల శౌర్యముచూడండి ,,
వెంటనెతుగ్లకు వార్తబంపినాడు ,,
బాహుద్దీనును వప్పగించమనెను ,,
లేనిచోయుద్ధము తప్పదన్నాడండి ,,
జంబుకేశ్వరుడు, మారుపల్కినాడు

"తప్పులున్నను క్షమియింపగవచ్చు
మేనల్లునిపై యింతకోపమేల?
ప్రాణముతీయగ ప్రయత్నించు టేల?
శరణాగతులను విడువకూడదండీ
ప్రాణముకంటె కీర్తి యెక్కువండీ
బహుబుద్దీనును వదల నేరనండీ
నాచేతులతో వప్పగించలేను
నాప్రాణముతో వప్పగించలేను
యుద్ధముకైనా సిద్ధమేనుండీ"

ఇదివిని బాద్షా మండిపోయినాడు,— తం॥
వెంటసైదండును పంపించినాడు ,,
ఆనెగొందిని ముట్టడించినాడు ,,
పండ్రెండేండ్లు సమరము సాగిందీ— ,,
పౌరులందరు ఓపిక పట్టారు ,,
మహాధైర్యముతో పోరాడినారు ,,
వారిశౌర్యము వర్ణింపగలేము ,,
అప్పటిశౌర్యము లిప్పుడెక్కడండి? ,,
అప్పటివీర్యములిప్పుడెక్కడండి ,,

వ॥ ఇప్పటి నవనాగరికత బలియకపూర్వము మనదేశములోని జనులు ఎంతో బలశౌర్యధైర్యసాహసోపేతులై యుండెడివారు. ఇప్పుడు ఇంగువకట్టిన గుడ్డవాసిమాత్రమేనండీ॥

నవనాగరికత బలియకమును పెంతో - నయమేమన దేశం
అవలక్షణాలల్పాయుర్దాయా-లప్పుడు లేవండి,
అకాలమరణాల పూర్వరోగా-లప్పుడు లేవండి,
ముప్పదేండ్లకే తలనెరియుటలు-అప్పుడు లేవండి,
అరఘర్లాంగుకె వాహానమెక్కుటలు-లప్పుడు లేవండి,
వీర్యవృద్ధిలేహాలప్పుడింత-వెలయలేదుసుండి,
అశోకారిష్టలర్కు-లోధ్రలు-ఆనాడు లేవు,
జీవామృతములు క్షీరవర్ధనులు-చెలరేగగ లేదు,
అమృతాంజనాల్, హార్లిక్సులు ను-అసలే లేవు నాడు
కాడ్లివరాయిలు, గనోకిల్లరులు-కానరావు నాడు,
ఒకరిద్దరు పిల్లలతోనే నాడు-వృద్ధులు కాలేదు,
నేటిదంపతుల పడకటిండ్లప-న్నీరత్తురు లేవి?
నేటిదంపతుల పడకటిండ్ల ఫే-ణీలులడ్డు లేవి?
గదులనిండమందులసీసాలే-గద! యున్నవి నేడు!
ఇప్పుడీవిచిత్రములకన్నిటికి-నేమికారణమ్ము?
మరబియ్యాలే, నల్లానీళ్ళే-మంచికారణాలు,
కాఫీ, చా, సిగరెట్టు, చుట్టలే-కారణాలుసుండీ,
వేళపాళలేని ఫలహారాలే-చాలకారణము,
రైలుప్రయాణాలేరోగాలకు-ప్రధానబీజాలు
ఇదియంతానవనాగరికతామ-హిమయేనమ్మండి
ఇదిమన భారతజాతిపాలిట-మృత్యువె నమ్మండి
దీనినిరోసిననాడేమనకుక్-తేజమెక్కునండీ!
దీనినిబాసిననాడేమనకుక్-హానితొలగునండీ!

వ॥ ఆనెగొందెయోధులు నిజముగాయోధులు గనుకనే పండ్రెండేండ్లు ఏకదీక్షగా యుద్ధముచేయగలిగినారండీ; అయినప్పటికీ:—

జయాపజయములు దైవాధీనములు; తం॥
ఆనెగొందివారలలసిపోయినారు; ,,
బయటిసహాయము వారికి రాలేదు; ,,
యోధులందరు బలియైపోయినారు, ,,
జంబుకేశ్వరుడు స్వర్గమేగినాడు, ,,
అర్గురెళ్ళైదీలైరిసేనలోను, ,,
హరిహరబుక్కలు ఇరువురుకలరందు, ,,
కోటలోనికి వచ్చిరిశత్రువులు, ,,
మగవురుగన్నమాటయెలేదండీ; ,,
ఆనెగొందిని ఆక్రమించినారు! ,,
మలిక్ నాయబు అధిపతి అయినాడు; ,,
కాని ఎంతో కాలమేలలేదు; ,,
ఆంధ్రప్రజల ధాటికాగలేదు, ,,
ఆతనిరాజ్యము అల్లరిపాలయ్యె; ,,
తుగ్లకుబాద్షా ఆలోచించాడు, ,,
హరిహరబుక్కల చెరవిడిపించాడు; ,,
వారిపరాక్రమ మెంతోమెచ్చాడు ,,
ఆనెగొంది హరిహరునకిచ్చినాడు ,,
బుక్కరాయలను మంత్రిగచేశాడు ,,
అంతటవారు ఆనందముతోడ ,,

ఆనెగొందికి వచ్చిచేరినారు ,,
చుట్టుప్రక్కల రాజ్యపరిస్థితులు ,,
చూడమిక్కిలి ఘోరముగానుండె ,,
పరమతస్థుల పాలనమందునను ,,
సుఖమనుమాటే లేదాప్రజలకును ,,
అచటిఘోరములు చెప్పనలవికాదు ,,
మతసామరస్యమనుమాటేలేదు ,,
గోహత్యలకు కొదవయెలేదండి ,,
హిందూశిఖలకు ఎంతోకష్టమయ్యె ,,
హరిహరరాయలు ఆలకించినాడు ,,
బుక్కరాయలతో ఆలోచించాడు ,,
చేయగలిగినది యేమియులేదపుడు ,,
పేదవారికోపంబు పెదవిచేటు ,,
కాలముకలిసిరావలెననుకొనిరి ,,
భగవంతునిపై భారమువేశారు ,,

ఇట్లుండ రాయలసోదరులొకనా - డేగిరి వేటకును
తుంగభద్రదక్షిణతీరంబున_దొరలు వేటాడిరి,
అచ్చటకుందేళ్ళున్నవి ఎంతో-అపరిమితముగాను,
వానిబట్టగా వేటకుక్కలను-వదలిపెట్టినారు
వేటకుక్కలు కుందేళ్ళపైకి-విజృంభించినవి,
కాని అదేమివిచిత్రమోకాని-కరువలేవువాని
విపరీతముగా కుందేళ్ళుకుక్కల-విదలింపగసాగ;

కుందేళ్ళుతరుమగ కుక్కలు పరుగిడుట-కొత్తవింత యేను
అదిగని రాయల సోదరులెంతో-ఆశ్చర్యపడినారు;
ఇట్టివింతమన మెందును గానము-ఏమిహేతువోను
అనితలపోయుచు వేటనాపి వా-రచటనుండి వెడలి
తుంగభద్రకడ జూచిరివారొక-దొడ్డయతీశ్వరుని
ఘనకాషాయాంబరములతోను-కమండలువుతోను
పావుకోళ్ళతో దండముతోను-భస్మపుండ్రములతో
శాస్త్రాధ్యయన పరాయణులైన-ఛాత్రసంతతులతో
అపరశంకరుండోయననొప్పెడు-నట్టివానిగనిరి
మహాతేజస్వియై వెలింగెడు-మహామహునిగనిరి
ఆయన తేజము జూచివారలు-ఆశ్చర్యపడిరి
కలియుగమందున నిట్టివారలు-గలరే ఇలలోన?
దర్శనమాత్రము చేతనె జన్మము-ధన్యమయ్యె మాకు;
మాయదృష్టము నేటికిపండిన-మాడ్కిగానవయ్యె;
అనిమహాభక్తి సంభ్రమములతో-నాయతికడకేగి
హరిహర రాయలు బుక్కరాయలు-అతివినయముతోడ
సాష్టాంగనమస్కారముచేసి- అంజలిబద్ధులయి
నిలచినంత నే "నిజమనోఽభీష్ట-ఫలసిద్ధిరస్తు"
అనియతీశ్వరుండాశీర్వచనం-బనుగ్రహించియును
వారికి నిజాశ్రమమున విడియించి-వసతులుగల్పించి
మనసుకానందమగునట్లు సకల-మర్యాదలు చేయ
హరిహర రాయలు బుక్కరాయలు-ఆయనశిష్యులను
శ్రీయతీశ్వరుని చరితమడుగగా-చెప్పిరివారంత:-

యజుర్వేద శాఖీయుడు బోధా-యనసూత్రుండగుచు
భారద్వాజసగోత్రోద్భవుడౌ-పరమపుణ్యమూర్తి
సాయణవంశపయోనిధిరాకా-చంద్రుడనగబరగి,
మాయణుడను నామంబునబొప్పిన-మహాశాస్త్రవేత్త
ఆయనసతి శ్రీమతియనుసాధ్వి-అనుపమగుణశీల
ఆదంపతులకు మాధవ సాయణ-భోగనాథులనగా
ముప్వురుపుత్రులు కల్గిరిముద్దులు-మూటగట్టువారు,
సకలజనానందకరులు వారు-సర్వశాస్త్రనిధులు
అందు జ్యేష్ఠుడౌ మాధవుడన్నిట-నగ్రగణ్యుడండీ,
అదిఇదియనకను అన్నిశాస్త్రముల-నాచార్యుండతడు
ఎన్నియున్నను మహావినయసం-పన్నుండతడండీ,
బుద్ధియందునపోలికరాడు-బృహస్పతియుకూడ,
ప్రజ్ఞయందున సాటికిరాడు-బ్రహ్మదేవుడైన
శౌర్యమునందున చెప్పగరాదు-షణ్ముఖునికూడ;
మాధవీయధాతువృత్తి,కాల-మాధవీయములను
మాధవనిదాన మధికరణరత్న-మాలాగ్రంథముల
సర్వదర్శన సంగ్రహమ్ము మరి-శంకరవిజయమును
పరాశరమాధవీయము, వేదాంత-పంచదశినికూడ
వేదార్థప్రకాశిక, జీవన్ముక్తివి-వేక గ్రంథములను
అలంకారసుధానిధి, జైమినీయ-న్యాయమాలకూడ
రచించి మహాయశస్సుగడించిన-ప్రజ్ఞాఘనుడితడే;
వేయేల? శతాధికగ్రంథకర్త-విజ్ఞమూర్తియితడే
అదియిదియనకను అన్నిశాస్త్రముల-నాచార్యుండితడు;

యత్యాశ్రమమును స్వీకరించి వి-ద్యారణ్యుండయ్యె
విద్యలకెల్ల అరణ్యమగుచు-వెలయునట్టివాడు;
ఈమహామహుని మహిమజెప్పుటకు-నెంతవారమయ్యా;
అని శిష్యులు చెప్పినవిషయమువిని-అత్యానందముతో
హరిహరరాయలు బుక్కరాయలు-ఆలోచించారు;
ఈసర్వజ్ఞులననుగ్రహమున్న-నింకతక్కువేమి?
హిందూసామ్రాజ్యము స్థాపించుట-యెంతటికార్యమ్ము?
అనిశ్రీవిద్యారణ్యయతీంద్రుల-నాశ్రయించినారు.
దేశపరిస్థితులన్నివారికి-తేటపరచినారు
హిందూప్రజలఅగచాట్లన్ని-ఎరుకబరచినారు;
సామ్రాజ్యస్థాపనావసరమును-చర్చించినారు;
"అయ్యా! మామనవిఁ వినుడీ మీ-రనుగ్రహముతోడ;
దేశమంతయునెంతోహీన-స్థితిలోనున్నది;
జనులలోనైకమత్యముబొత్తుగ-సన్నగిల్లినది;
జాతినీతులను జ్ఞానముబొత్తుగ-జారిపోయినది;
స్వదేశభాషలపైనలక్ష్యము సడలిపోయినది;
బానిసతనము ప్రజలలోబాగుగ-వ్యాప్తిచెందినది;
నౌకరీలకై ఎంగిలికూడు-నమలుటెక్కువాయె;
పైసలకై దేశస్థులనుమోస-పరచుటెక్కువాయె;
పట్టుదలకు పరకీయులపాదము-పట్టుటెక్కువాయె;
జ్ఞానములేక పరమతములలో-గలియుటెక్కువాయె;
జన్మభూమిపై అభిమానమ్మే-సన్నగిల్లిపోయె;
ఇందువలననే దేశములోనికి-ఇతరులువచ్చారు;

వచ్చిమనమత దేవాలయముల - పాడుచేసినారు,
పాడుచేసితమమతములనిచ్చట - ప్రవేశపెట్టారు;
ప్రవేశపెట్టి ప్రచారములచే ప్రబలముచేశారు;
ఇంకనిట్లు కొన్నాళ్లుండినచో - నెంతో మోసమగును;
హిందూదేశము, హిందూమతమే - ఎగిరిపోవునండీ
పరధర్మములేయెచ్చట జూచిన - ప్రబలిపోవునండీ
పరధర్మియులేఎచ్చటజూచిన - ప్రబలిపోదురండీ;
అనాదియైన హిందూమతముకు - హానికలుగునండీ;
తమవంటిమహానుభావులిక ముందు - దయింతురో లేదో
కావుననిప్పుడె తాముదయజూడ - గావలయును స్వామీ!
మామనవిని విని హిందూధర్మము - నోమవలయుస్వామీ
తమతపోబలము ధర్మరక్షణకు - ధారపోయుడయ్యా!
తమమేధాబలము దేశమునకై - ధారపోయుడయ్యా
అనిహరిహరరాయలు బుక్కరాయ - లపుడుపల్కగాను;

వ॥ వెనుకటినాయకులు ధర్మముకొరకై; మతముకొరకై పైవిధముగా ప్రయత్నిస్తూఉండగా యిప్పటినాయకులు పదవులకొరకు, పేరుకొరకు మతధర్మములను బలియివ్వజూస్తున్నారు:—

## నాయకులు

నవ్యయుగములో నాయకశకము - నడచుచున్నది
రాజకీయస్వాతంత్ర్యముకొరకై - ప్రయత్నింపగాను
నడుముగట్టి వారలుకొందరు - నాయకులైనారు

రాజకీయము లెకాకవారన్ని - రంగమ్ములలోన
వేలు బెట్టుచు భారతధర్మపు - వేరుపురుగు లైరి
స్వరాజ్యనెపమున వోట్లుపుచ్చుకొని - శాసనసభ కేగి
తిన్నయింటివాసాలు లెక్కించు - తీరునవర్తించి
సంఘసంస్కరణ మనే పేరుతో - సంకరమ్ము చేసి
పాశ్చాత్యసంఘపద్ధతులనిచట - ప్రవేశపెట్టుట కై
చచ్చుపుచ్చు చట్టాలు చేయగా — సాగించినారు
రావుకమిటీ ఏర్పాటు చేసిరి - రంకుతనము బెంప
జాతినీతులు లేని నాయకులు - సంప్రాప్తించారు
ప్రజలకోరికల పెడచెవి పెట్టే - వార లెవోరికారు
ఆంగ్లదేశమున నిట్టివాగిసి — ఆదరింపబోరు
యుద్ధనీతినిపుణుడైన చర్చిలు - కుద్యోగనవచ్చె
శాంతిసమయమున నాతనికందరు - స్వస్తి చెప్పిరండి
అట్టే రాజకీయజ్ఞులకు సాంఘి - కాదులేమి తెలియు?
తెలియకపోగా తెలిసినట్టులే - తీండ్రింతురు వారు
రాజకీయము లెకాకవారన్ని - రంగమ్ములలోన
వేలు పెట్టుచు భారతధర్మపు - వేరుపురుగు లెరి
ముసల్మానులతో ఐక్యమనుచును - మొదలు పెట్టినారు
స్వరాజ్యమై తేరాలేదు కాని — పాకీస్థాను మొలిచె
మొలకసుకలుపు తీసివేయుగల - మొనగాండెవరండి?
భారతఖండము బద్దలుకొట్టగ — ప్రవీణులేనంతా
పదవులకోరకై ప్రాకులాటలో - ప్రవీణులేనంతా
సంయుక్తనియోజవర్గాలకు - స్వస్తి చెప్పినారు

అర్థములేనిప్రణాళికలతో - ఆర్భాటాలేను
భారతజాతీయధర్మము నేతారు - మారు చేతురండీ
స్వాతంత్ర్యముకై స్వధర్మమునుబలి - సలుపజూతురండీ
పందిరికై యిల్లుపడగొట్టునట్లుగ - పనులు చేతురండీ
గోత్రాలమందను బోలినప్రజలు - వెఱ్ఱివారలండీ
నందంటేనందని పందంటేపందని - నమ్ముతారు ప్రజలు
అమాయకప్రజను లెవరేది చెప్పిన - నదియె నమ్ముతారు
భారమంతమీదేయనినాయకుల - పైననిలుపుతారు
స్వతంత్రించి ధర్మాఽధర్మాలను - పాటింపగలేరు
స్వతంత్రించికర్తవ్యాకర్త - వ్యముల నెరుగలేరు
ఈవిధముగనిద్రించుటయికముం - దేమియుతగదండి
జాగరూకులై స్వధర్మపరులై - సాగవలయునండి
స్వధర్మమున్నచో స్వరాజ్యమదియే - వచ్చుతప్పదండీ
స్వధర్మమందామహాత్మ్యమున్నది - చక్కగ తెలియండీ
స్వధర్మమునప్రహ్లాదుడభ్యుదయ - శాలియయ్యెనండీ
స్వధర్మమున నేహరిశ్చంద్రుడుప్ర - శస్తుడయ్యెనండీ
స్వధర్మమున నేభీష్ముడుమహాను - భావుడయ్యెనండీ
స్వధర్మమున నేధర్మవ్యాధుడు - భవ్యుడయ్యెనండీ
స్వధర్మమున నే శ్రీరాముడుజన - వంద్యుడయ్యెనండీ
స్వధర్మమున నే ధర్మరాజుసుయ - శస్కుడయ్యెనండీ
ఇట్టిస్వధర్మమునవలంబించుటె - ఎంతయు మేలండీ
దీనినినిరాకరించుట దెంతయు - తెలివితక్కువండీ

వ॥ వైవిధముగా హరిహరరాయలు, బుక్కరాయలు చెప్పిన విషయములను విని శ్రీ విద్యారణ్యులవారు ఏమిచేసి రనగా:—

యంతీంద్రులప్పుడు రాయలమనవిని-ఆలకించినారు
దివ్యదృష్టితో భావికాలగతి తిలకించినారు;
ధర్మరక్షణమె పరమార్థమ్మని-తలపోసినారు
జన్మభూమి స్వర్గమ్ముకంటెను ఘనమనియన్నారు;
("జననీ జన్మభూమిశ్చ! స్వర్గాదపి గరీయసీ")
ప్రజలనుమేల్కొలుపుటకై పాటు-పడవలెనన్నారు;
సామ్రాజ్యస్థాపనమవసరమని-సమ్మతించినారు;
అందులకై తగుసైన్యముకూర్చగ-నామోదించారు
ధర్మరక్షకుడు మాపతిమనకా-ధారంబన్నారు
కార్యశూరులై నడుముబిగింపం-గావలెనన్నారు;
చూపవద్దంతవాత్రమారంభ-శూరత్వంబనిరి
ఆరంభించిన కార్యముకొనవర- కాచరింపుడనిరి
భగవంతునిపై భారమువేసి-ప్రయత్నింపుడనిరి
నేనుమీకెపుడు బాసటగాను-నిలచియుందుననిరి
అంతటరాయల సోదరులత్యం-తానందముతోడ
తమసంకల్పము నెరవేరినదై-తలచిసంతసిలిరి!
తామరణ్యమున జూచినవింతను-తపసికెరింగింప
విద్యారణ్యయతీంద్రులు తెలిపిరి-వింతకుకారణము;
"ఆస్థలమున నివసించునట్టివి- అల్పజీవులైనా

అధిక బలముతో నుండు నాస్థలము-హత్త్వమట్టిదయ్యా
కాననచటమన రాజధానిని-కట్టించుట మేలు,
అందువలనమన పౌరులు అతిశౌ-ర్యాత్ములౌదురయ్యా"

వ॥ అని శ్రీ విద్యారణ్యులవారు చెప్పినారు ఈసందర్భములో మనపూర్వుల ప్రకృతిశాస్త్రజ్ఞానమునుగురించి కొంత చెప్పవలసియున్నది. మన పూర్వులకు ప్రకృతిశాస్త్రజ్ఞానము లేదనియును, ప్రతివిషయమునకు వారేదో సమాధానములను కల్పించి చెప్పెడివారలనియును, ఆధునికులు వాదించెదరు. అందుకై వారు ప్రధానముగా గ్రహణవిషయమును ఉదాహరణముగా చూపెదరు. గ్రహణములయొక్క నిజతత్వమును ప్రాచీనార్యులు గ్రహింపలేక "పాము" చంద్రసూర్యులను మ్రింగుచు వదలుచు, నుండునట్లు శాస్త్రములలో వ్రాసినారని ఆధునికులనెదరు. ఈవాద మెంతమాత్రమును వాస్తవముకాదు. మన పూర్వులు గ్రహణమునకు కారణము "పాము" అని చెప్పుటకు కారణమున్ను, వారికిగల అపార ప్రకృతిశాస్త్రజ్ఞానమును ఈ క్రింద సూచించెదను వినుడయ్యా—

## గ్రహణములు

గ్రహణాలసమాచారము మీరుసం-గ్రహముగవినరండి
ఇహమేకాక పరముకూడనందు-యిమిడియున్నదండి
వేదశాస్త్రాలలో రవిచంద్రులకు సర్ప-వేధచెప్పిరండీ,
వేదాలకు నిజము తెలియదంటే గ్రహణ-వేళ తెలియలేదా?

ధరణిసూర్యచంద్రగతుల గణితముకష్ట-తరమైనదేకాదా?
గణితము తెలిసినగ్రహముల సంగతి-గ్రహియించుటెకాదా?
పుడమి, చంద్రుల, నీడలు సర్పపు-పడగలవలెనుండు- ఆ
నీడలోనికవి పోయినయప్పుడు-చూడరాకయుండు,
ఆసమయములో వాతావరణము-నందుమార్పుకలుగు,
ప్రపంచమందలి భౌతికశక్తులు-ప్రబలియుండునపుడు
మనుజుల సువశ్శరీరములందున-మార్పులెన్నోకలుగు
జీర్ణకోశముల స్థితిగతులన్ని-చెల్లాచెదరౌను,
కడుపున జీర్ణముకానిపదార్థము-కలుగగూడదండీ,
గర్భస్థములైన పిండములకపుడు-గండసమయమండీ, ఇట్లు
పాముజొఁబడిన యిల్లువలెజగము-భయంకరమ్మగును,
గనుకనె గ్రహణంబపుడుజనులుజా-గ్రతగనుండుకొరకై
ఘనముగశాస్త్రము లద్దానిని పా-మనుచుచెప్పెనండీ,
కావుననప్పుడు నియమముతోడుత-గడపలయునండీ॥
మంత్రతంత్రములవలన మనము ని-ర్మలముచేయవలెను
ఆదిమధ్యాంతములలో స్నానము-నాచరింపవలెను
అందునదుష్టపు విద్యుచ్ఛక్తులు-ఆవరింపకుండు
సత్యమేయిదియంతయు ననిమీరలు-సంశయింపవలదు
మనకంటికి కనపడునవియేనిజ-మనియెంచగవలదు
మరియొకదృష్టాంతము తెల్పెదను-మనసుగల్గివినుడు
సూర్యునిలోగల మచ్చలుచిత్రము చూడముచ్చటండీ
సూర్యునిమచ్చలు చూపుప్రభావము-చూచినారమీరు?
పదునొకండేండ్లకొకపరి యవి పరి-భ్రమియించెడినండీ,

వానిమార్పులను బట్టిభూమిలో-వచ్చుమార్పులండీ
విద్యుచ్ఛక్తిలో ఎన్నోతుపానులు-వీచుచుండునండీ,
దూరశ్రవణ ప్రసారపుకోలతలు-మారుచుండునండీ,
ఒక్కొక్కప్పుడు రేడియోయంత్రము-లూరకుండునండీ
రేడియో లేనిచో యీమచ్చలపని-యేడ తెలియునండీ?
సత్యమెయిదియంత యుననిమీరలు-సంశయింపవలదు
మనకంటికి కనుపడునవియే నిజ-మనియెంచగవలదు
మనయింద్రియములకును మించినట్టి-వనేకములుకలవు,
వానినిగ్రహింపగాగలవు రెండు-పద్ధతు లేనండి
మొదటిదిసూక్ష్మమ్ములైనయంత్ర-మ్ములచేకనుగొనుట
ఇంద్రియనిగ్రహ మొనర్చితపమున-నెరుగుట రెండవది
ప్రథమపద్ధతిని గలవనేకలో-పములు తరచిచూడ
ఎంతసూక్ష్మయంత్రములకైనను-ఎరుగరానివెన్నో
వింతవిషయములుగల వీభువిలో-వేలకువేలుగను
పరిశోధనవలన నేయంత్రములు-వర్థిలవలెనండీ
నరులబుద్ధికిని పరిశోధనలో-నెరసులుండునండీ
తెలియనయ్యావార్ తప్పులు చేసి-దిద్దుకొనుటెయండీ
మెరుగనమ్మవా గొలకబోసికొని-మెత్తుకొనుటెయండీ
ఆవిధముగనే పరిశోధకులకు-అగచాట్లేయండీ
స్థిరమేలేదా పరిశోధకుల-సిద్ధాంతములకును
వారిదృష్టిలో నేటిసత్యమే-మారును రేపటికి
వారిలోవారికె సరిపడదండీ-వాదులాటలండీ
అట్టివారివాక్యములనునమ్మట-దెట్లుపొసగునండీ

వారిమాటలను నమ్మి వేదము ల-బద్ధమనుటతగునా?
రెండవపద్ధతి యింద్రియజయమే-నిండుకుండనుండీ
తొణకదు, బెణకదు, ఘనపూర్ణస్థితి-తోసత్యముసుండీ
తపముచేత సాధించినవిద్యకు-తరుగులేదునుండీ
వస్తుతత్త్వమంతయిమునులకుకన-బడుచునుండునండీ
తపశ్శక్తిమహిమనుచెప్పుటకెం-తైనచెప్పవచ్చు,
పాశ్చాత్యులుకూడానేడాస-త్ఫలితముగనినారు
"హిప్నాటిజము"న అమెరికనుసేన-లెంతోనేర్చెనండీ
"హిప్నాటిజ"మనగా తపోలేశ-మేయనితెలియండీ
తపమునుమించిన పరిశోధనలే-దనిమీరెరుగండీ
తపసులమించిన పరిశోధకులీ-ధరలోలేరండీ

ఈప్రకారముగ సూర్యునివలననె-ఎన్నోమార్పులైన
తక్కినగ్రహముల వలననుప్రకృతిలో-పెక్కుమార్పులెసగు
మనసుకూడనొక భాగమెప్రకృతిలో-మరువకూడదండీ
మనసుకూడప్రకృతివెంటనెన్నో-మార్పులందునండీ
మనుజునినడవడి యిందుచేతనే-మారుచుండునండీ
ఏకాలములందే యేగ్రహములు-యెట్టిమనసులందు
ఏయేరకముల మార్పులుచేయునో-ఎరుగవచ్చునండీ
ఇదియేగ్రహచారం బనిజ్యోతిష-మెరుగబరచునండీ
ఇట్టిప్రకృతిరహస్యమునెరుగని-యెడ్డెవారలంత
వట్టిదిజ్యోతిష శాస్త్రంబనుచును-వాదనచేసేరు
మనపూర్వర్షులనంతజ్ఞానసం-పన్నులైనవారు

# "ఆటంబాంబు"

వారికి తెలియని ప్రకృతి చిత్రములు-ధారుణిలో లేవు
"అణోరణీయాన్ మహతో మహీయాన్-అనివారన లేదా!
అణువులోని మహాద్భుతశక్తి వా-రరసి యుండలేదా?
ప్రకృతిలోని ప్రతియణువుకూడశక్తి-భరితమె యనలేదా
ఏ పరిశోధన చేసివారు దీని-నెరిగియుండిరండీ
తపముచేతనే ఋషులు ప్రపంచపు-తత్త్వ మెరిగినారు
తపమునుమించిన పరిశోధనలీ-ధరణిలో లేవండి
తపసులమించిన పరిశోధకులీ-ధరలో లేరండి
ఋషులుచెప్పిన సత్యము నేడు-ఋజువైనదండీ
పాశ్చాత్యులుకనిపెట్టిన "యాటం-బాంబు"నుచూడండీ
పరమాణువులో నిమిడినశక్తిచే-ప్రళయమెరా లేదా?
ఒక్క-దెబ్బకే జపాను మాడి"దా-సోహ"మ్మనలేదా
అతిసూక్ష్మంబగు అణువులొ ఇంతమ-హత్త్వమున్నదన్న
ఎరుగనివారలు "ఇహిహీ"యనుచును-ఇకిలింతురు కాదా?
ఇట్లే ప్రకృతిలొ రహస్యవిషయము-లెన్నొ యున్నవండీ
దివ్యదృష్టిగల ఋషులెతప్పయివి-తెలియలేరు పరులు
తెలియకపోగా తెలిసినట్టులే-తిండిరింతురు వారు
ఇట్టిడాబుసరిగాండ్లు దేశానికి-వేరు పురుగులండి
వీరికుయుక్తులను ప్రజలందరు-పెడచెవి బెట్టండీ
వీరిదుర్వాదనలను జనులందరు-చేరి మొదర్చండీ!
మనసనాతనధర్మపు ఘనతను-కొనియాడగ రండీ!

# వర్ణాశ్రమధర్మము

వ॥ ఈవిధముగా కేవల ప్రకృతిశాస్త్ర రహస్యములను మాత్ర మేకాక, ఆర్థికాది సర్వవిషయములందువను మనపూర్వు లఖండ జ్ఞానసంపన్నులైనవారు. వారిబోధనలు కేవలము పాంచ భౌతికమును తాత్కాలికమును అగు మిడిమిడి జ్ఞానముపైన ఆధారపడక, శాశ్వత ప్రపంచ శాంతిసుఖములను సూత్ర ముపై ఆధారపడియున్నవి. ఇందుల కుదాహరణము భారత దేశమందలి వర్ణాశ్రమ ధర్మమే. అది యెట్టిదనిన—

దివ్యదృష్టిలో మహామునులు సమ్మతించిన ధర్మమ్ము,
భవ్యమైభారత క్షేమ విధాయియై-బరగును నిరతమ్ము
వర్ణాశ్రమములె పునాదియగుచును- వరలు ధర్మమిద్ది,
పూర్ణంబైన నాగరికతకును-పుట్టినిల్లుయిద్ది
ప్రజలలో పరస్పరాధారము-వలన శాంతిగలుగు
అట్లుకాక పోటీయే యున్నచో-కొట్లాటలు గలుగు
ఇంతియెకా దధికారంబును కేం-ద్రీకరింపరాదు *
విద్యావ్యవస్థపై యధికారము-విప్రులకును వలయు
దండనాధికారము క్షత్రియులకు-నుండవలయు నండి
ఆర్థికాధికారము వైశ్యులకే-యమరవలయు నండి
పారిశ్రామిక బలము శూద్రులకు—చేరవలయు నండి
ఈరహస్యముల నెరుగనివారలు-ఏమోపల్కెదరు
వర్ణధర్మముల కిష్టమువచ్చిన-భావమునెప్పెదరు

---

* decentralisation of power.

వర్ణ సంకర వ్యభిచారములను-ప్రచారింతురండి
జాతినీతులను చుల్కన చేసి-చంకలు కొట్టెదరు
వైశ్యులొంటెలతొ సమానులనుచును-వ్రాయుచుందురండి
పరమానందయ్య శిష్యులిట్లు-పల్కుచుందురండి
ఇట్టివారి మోసంబులను వైశ్య-లెరుగకుండగానే
ధనసహాయమ్ముఁ జేయుచుందురు-ధర్మహానియనక
సమస్తధర్మ కార్యంబులకు-సహాయులగు వైశ్యుల్
పాత్రాపాత్రత లెరిగియె సహాయ-పడుటమంచిదండి,
ఈవిధముగా కర్మవిభాగము-లేర్పడుచుటవలన
ఒకరిపైనొకరధికార దుర్వ్యని-యోగపరులు గారు
ఒకరివృత్తికై మరొకరు పోటీ-యుండ దిందువలన
ఈపద్ధతి పాశ్చాత్యులు పలువురు-ఎంతో మెచ్చినారు
ఆర్థిక శాస్త్రజ్ఞు లెందరొకొని-యాడినారలండీ
ఊహలకందని కాలమునుండియు-ఉన్న ధర్మమండీ
కోట్లకొలదిగా తరములునడచిన-గొప్ప ధర్మమండీ
చరిత్రకందని కాలమునుండియు-జరుగు ధర్మమండీ
చీనా దేశపు రాయబార్లుమె-చ్చిన ధర్మమిదండీ
గ్రీకుదేశంపు రాయబార్లపొగ- డికల గన్నదండీ
ఆరునెలలు వాయించినమద్దెల-నడుగవలెనె మంచి?
ఈపద్ధతితో సాటిగశాంతిమ-రేపద్ధతి గలదు?
ఈవ్యవస్థతో సాటిగసుఖము మ-రేవ్యవస్థ గలదు?
నిరుద్యోగమను పెనుభూతము మన-దరిని జేరకుండ
పారద్రోలుటకు వర్ణధర్మమే-ప్రబలాయుధమండి

మహాయంత్రముల నిషేధించిన-మనువుపిచ్చివాడా?
ఫ్యాక్టరీలవలన నేగద ధనిక-వర్గము పెరుగుటయు
నిరుపేదలగుచు కార్మికవర్గము-నెగులుచు నుండుటయు
ఫ్యాక్టరీలవలన నేగద హెచ్చు-వస్తూత్పత్తియును
వానివిడుదలకు మార్కెటుకొరకే-పరదేశాక్రమణ
పరదేశాక్రమణమ్ములవల్ల నే-ప్రచండయుద్ధాలు
ప్రచండయుద్ధావసరాలకునై-ప్రజలకు కష్టాలు
అందున భారతదేశపుబాధల-కంతుపొంతు లేదు
కూటికిగుడ్డకులేక జనులందు-కోట్లెచచ్చారు
చావగమిగిలినవారునుసగము-చచ్చినవారైరి
రేషనింగులో బాధలు పగవా-రికైనావద్దు
గోధుమ లేతినువారికి జొన్నలు-కొల్చియిత్తురండీ
బియ్యముతినువారికి గోధుమలను_పెట్టిమాడ్చుతారు
బియ్యమునిండా వడ్లురాళ్ళు-పెల్లుగనేయుండు
ఎఱ్ఱరంగుచూచినచోనోటికి-ఎదురువచ్చునండీ
గుడ్డములైనా తినలేని యినుప-గుగ్గిళ్ళేనండీ
బ్లాకుమార్కెటు బాధలనిచ్చట-వర్ణింపగరాదు
బాంబుదెబ్బలకు భయపడిప్రజలు-పారిపోయినారు
పట్టణవాసాలన్నికొన్నాళ్ళు-పాడుబెట్టినారు
బాంబుదెబ్బలు తినిననగరాలు-భస్మమైపోయె
ఈవిధముగ ప్రజలందు శాంతియే-యెందుగానరాదు
ఇట్టికష్టములకునుమూలమైన-యట్టియంత్రములను
నిషేధించుటలో మనువుచూపిన-నిపుణతచూడండీ

చేతిపనుల చేప్రపంచ శాంతిని - చేకూర్పగవచ్చు
వృత్తి విద్యచే ప్రజలకుసుఖమును - వెలయింపగవచ్చు
సేఫ్టీ రేజరుచేత మంగళ్ళ - జీవనంబెపోయె
సబ్బుబిళ్ళ, ఐరనింగు, చాకలి - సంపాదన చెరిచె
బస్సులుపుట్టి బళ్ళవాళ్ళ సం - పాదన చెరిచినవి
ఈవిధముగనే యితరములైన - వృత్తులు చెడిపోయె
సేవకావృత్తికే జనులందరు - చేరసాగినారు
కావునసందు పోటీయెక్కువ - గా నుండుటచేత
పరస్పరంబును ద్వేషముపెరిగె - భారతీయులందు
ఐకమత్యమను మాటయె నేడు - అదృశ్యమైపోయె
అందువలననే బానిసతనము - అంతరించలేదు
ఈదుస్థితిని తప్పించుటకే - కైక సాధనమ్ము
వర్ణాశ్రమధర్మమ్మే సుండిది - బాగుగ తెలియండి
తెలిసీ తెలియని వారలు చెప్పే - పలుకులు వినకండి
వృత్తి చేతనే వర్ణము తెలియుట - వాస్తవమేనండి, కాని,
జన్మచేతనే వృత్తి నిర్ణయము - సలుపకున్న చేటు
ఎవరియిష్టముచొప్పునవాడే - వృత్తులు చేకొనగ
పోటీ మానవులందెట్లు తగ్గి - పోవగలదుధరలో?
కావున జన్మనుబట్టి వృత్తి వ - ర్ణావలంబనమ్ము
సలుపగవలయును జనులకు లేనిచొ - శాంతిలేదునమ్ము
తండ్రికడ సుతుడు తనవృత్తి విద్యను - తప్పక గ్రహియింప
సులభముగాను వృత్తిరహస్యముల్ - తెలియవచ్చునండీ
గృహపరిశ్రమాభివృద్ధికిదియొక - గొప్పసాధనమ్ము

భారతదేశ కత్యౌన్నత్యమునకు-పరమదోహదమ్ము
అట్టిమహత్తరమౌ జన్మజాతి సి-ద్ధాంతముబోధింప
పుట్టినదేగద "భగవద్గీతా"౽-మోఘశాస్త్రమిలను
క్షత్రియున కుచితమౌ రణధర్మము-కాదనియర్జునుడు
బ్రాహ్మణునకుచితమౌ వైరాగ్యపు-పల్కులుపల్కగను
"ధర్మమైనయుద్ధమేసూ క్షత్రియ-ధర్మమెల్లవుడును
దీనికంటె క్షత్రియునకులేదిక-దేవలోకపధము
స్వధర్మమందున నిధనంబైనను-సర్వశ్రేయంబే"
అనుచును శ్రీకృష్ణభగవానుడా-యర్జుననకు జెప్పె
కావున జన్మముచేతనె జాతియు-గలుగుస్వధర్మమ్ము
జన్మచేతనే జాతినిర్ణయము-సలుపును వేదమ్ము
"జాతి"యను శబ్దముద్భవమైనది-"జన్మ"నుండియేను
వేదమున వర్ణవిభాగముగలదు-విస్పష్టముగాను
స్మృతిపురాణములలో నింకను వి-స్ఫుటముగానుకలదు
సర్వమానవులు సమానులనుటకు-సందేహముులేదు కాని
ఏకత్వములో భిన్నత్వమ్మే-ఎసగుసృష్టియందు
*ప్రపంచమందలి మూలపదార్థము-పరగునొక్కటగుచు
అయినను వేర్వేర్వస్తుధర్మముల-నందుచుండుగాన
అట్లే మనుజత్వము సమానమే-యైనను జనులందు
ప్రకృతిభేదములు, జాతిభేదములు-వరలియుండుచాల
రూపగుణములను బట్టివస్తువుల- రూపించగవలెను
ఉప్పుకప్పురము లోకేరీతిగా-నుండు, రుచులు వేరు

*Atom— Electrons, & Protons.

అన్నిచోట్లలో నుండెడినీరు-అగపడునొక్కటిగా
కాని ఎన్నియో గుణభేదములు- కలిగియుండునందు
గంగాజలమ్మువలె నిలువయుండ-గలదెయితరజలము?
గంగాజలమువలె క్రిమిఘ్నముగా-గలదెయితరజలము
ప్రపంచమంతట వ్యాపించియున్న-వాయువొక్కటేను
కాని ఎన్నియో గుణభేదములు-గలిగియుండునందు
కూరగాయలన్నియు నొకటిగనే-కనుపడుచునునుండు
కాని ఎన్నియో గుణభేదములు-కలిగియుండునందు
అన్నిజంతువుల పాలనుచూడగ-నగపడునొక్కటిగా
కానిఎన్నియో గుణభేదములు-గలిగియుండునందు
నత్తగుల్లలు ముత్యములును, సు-న్నపురూపములేను
కానిఎన్నియో గుణభేదములు-కలిగియుండునందు
ఘనమగువజ్రము, బొగ్గుకూడను-"కార్బను"రూపములే
కానిఎన్నియో గుణభేదములు-కలిగియుండునందు
కాన గుణములనుబట్టి వస్తువుల-గల్గుభేదములు
రూపమొకదానివలనమాత్రమే-రూపింపగరాదు
మానవులందరకొకేరూపమగు-మాత్రమున నెసరియా?
వారిలో గుణమునందు భేద మగు-పడదెసృష్టిలోన?
చర్చిలు, స్టాలిను మున్నగువ్యక్తుల-సాటెవొయితరనరుల్?
వారికితరులకు భేదమెందు కను-పడును బాహ్యముగను?
కాన నరులందరొక్కటే యనుట-కల్లయెయగునండి॥
భావాద్వైతము మంచిదే; క్రియాఽ-ద్వైతముండరాదు
స్త్రీలందరలో తల్లితో, భార్యతో-చెలియాలితోకూడ

ఒకేరీతిగా పరివర్తించువా-రుందురేధరలోన?
సమానత్వమిట ఏమైపోయెనో-చక్కజూడరయ్యా?
మనుజులందరికి వేరివిధముల-మారుచుండుగాదా!
మనుజులందరు సమానమైతే మార్పు ఎందుగలదు?

కుక్కలు, పాములు, వేర్వేర్మనుజుల-గుర్తుపట్టలేవా?
పదములజాడల బట్టియెఱివ్వి-పసిబట్టుటలేదా?
భూమిపైనగల యడుగులజాడలో-యేమియున్నదండీ?
ఇప్పటివరకేనైంటిపైన-ఎరిగియున్నవాడా?

అడుగులజాడలలోనే మార్పులు-అడగియుండగాను
మనుజునిమన శ్శరీరములందున-మార్పులెన్నొలేవా?
కావుననందరు ఒకటేయనుట-కల్పితమ్ముకాదా?
ఈవిషయము గమనింపకపలుకుట-మౌఢ్యతనముకాదా?
వర్ణభేదములవలననె ఐక్యత-భంగమాయెననుచు
కొందరుపలుకుదు రదియుకూడను-కుయుక్తియేయండి

దేశచరిత్రను తెలియకపలికే-దేబెమాటలండీ
ఎన్నియుగంబుల వరకోపాలన-హిందువులదెయండీ
నిన్నమొన్ననే పరులువచ్చియున-నెత్తికెక్కిరండీ
అలెగ్జాండరును బోలినవీరుల-యాటసాగలేదు
పరులదాడులెన్నో మున్నుమనము-తరిమికొట్టినాము
ఆక్రమయుద్ధాలలో తురుష్కులు-ఆక్రమించినారు
భేదనీతితో కొద్దికాలమే-పేరుపొందినారు
మూడునాళ్ళ ముచ్చటగావారు-మురిపెముచెందారు

శివాజిచేతులో ఔరంగజేబు-చిక్కులుపడ్డాడు
చేతకాకను "కొండమెలుక"యని-చీదరించినాడు
శివాజిశక్తికి ఔరంగజేబు_చిత్తైపోయినాడు
శివాజికత్తికి ఎదురులేకను-చెల్లైపోయింది
భారతదేశపు మొగలుసామ్రాజ్యము-పతనంబైపోయె
హిందూదేశము హిందూరాజుల-దేఅయిపొయ్యేది
ఇంతటిలోకే తెల్లపక్షులు-ఎగిరివచ్చినవిరా
కడుపుకూటికి సంపాదనకై-కడకుచేరినారు
వంగివంగి సలాములుబెట్టుచు-ప్రక్కచేరినారు
నమ్మకమైన మాటలుచెప్పి-నమ్మించినారు
నజరానాలతో రాజులకండ్లు నలిపివేసినారు
గిడ్డంగులకై కోటలుపేటలు-గడ్డుగపెంచారు
క్రమక్రమముగా సైన్యాలను ఘనమేచేశారు
రాజులమధ్య భేదజ్వాలలు-రగుల్కొల్పినారు
లంచాలతో నీచోద్యోగులను-లాలనచేశారు
కూలికివచ్చి మొదలుపెట్టిరి-పాలిమాటలేను
తెలివితక్కువగ దేశీయరాజులు-వలలోపడ్డారు
దుబాసీలుబహు ధనాశచేత-ద్రోహముచేశారు
డూప్లే, బుస్సీ,క్లైవులు, నృపులకు టోపీపెట్టారు
అక్రమపద్ధతులతో మనదేశము నాక్రమించినారు
అధర్మయుద్ధాలతో మనరాజ్యము-నాక్రమించినారు
తుపాకిగుండు సాహాయ్యముతో-దొరలుగెల్చినారు

ధైర్యశౌర్యములు వీర్యముచేత-తామెగెలవలేదు
హిందూభుజబల పరాక్రమమునకు-నెవరుసాటిగలరు?
హిందూధర్మనిరతికి ధరలో-నెవరుసాటిగలరు?
జయాపజయములు దైవాధీనము-జయము ధర్మమెపుడు
స్వధర్మమున నిధనమైనసరెయని-శౌరిచెప్పలేదా?
వర్ణభేదములు లేనిదేశముల-పాట్లుచూడలేదా
జర్మని, ఇటలీ, జపానులలోవర్ణ-ధర్మమేమికలదు?
వారికివచ్చిన హానిసతనమును కారణమేమండి?
ఆయుధసంపద తగ్గుటచేతనె-అమరెహానిసత్వం
ఆయుధబలమును సంపాదించిన-నబ్బునుస్వాతంత్ర్యం
ఆయుధబలమె స్వతంత్రమునకు-ఆయువుపట్టండీ
ఆశారాహిత్యంబే సుఖమున-కాధారంబండీ
శక్తియు నిగ్రహమున్నచోటనే-శాంతియుండునండీ
ఏదియిందుతక్కువైనప్పటికిని యిబ్బందియౌనండీ
ఇదిగమనింపక వర్ణధర్మమును-హేళనచేయుదురే
ఇప్పటికైనను తెలివితెచ్చుకొని-హితముగమసలదగుర్
ఆయుధసంపద వృద్ధిచేసికొని-అభయముపొందదగుర్
మనశ్శరీరబలమ్ములు రెంటిని-మంచిగపెంపదగుర్
ఆర్షంబౌమన అస్త్రవిద్యను-అభ్యసింపవలయుర్
వర్ణధర్మములు తప్పకవృత్తుల-పాటింపగవలయుర్
వర్ణసంకరము కలుగనివిధమున-వర్తింపగవలయుర్
ధర్మయుక్తముగ అర్థకామముల-దప్పకనడపవలెర్
హిందూదేశము కర్మభూమియని-ఎరిగిచరింపవలెర్

హైందవులకు ముక్తియే చరమలక్ష్యం-బని గమనింపవలెన్
శృతిస్మృతులె హిందూమతమునకును-జీవము లది గనుడీ
అవిపాటించుట మనకభ్యుదయం-బదియదియో గనుడీ
ధర్మరహితమా స్వతంత్రిమున్నను-దాన చేటువచ్చున్
ధర్మసహితమా బానిసతనమై-నను మేలేదెచ్చున్
కావున స్వారాజ్యమునకై ధర్మము-కడకుత్రోయరాదు
కావున నాగరికతకై ధర్మము-కడకుత్రోయరాదు
కాన నైకమత్యముకై ధర్మము-కడకుత్రోయరాదు
కాలముమారినదని ధర్మంబును కడకుత్రోయరాదు
కాలానుకూలమైనమార్పులు-గలవుశాస్త్రములలో
వానిననుసరింపంగావలయును-గానివిడువరాదు
మనయిచ్చవచ్చినట్లుచేయ ధ-ర్మముకాదెన్నటికి
ప్రకృతివిషయములు మనయిష్టంబును-బట్టిమారవెపుడు
పాతబడినమాత్రమున ధర్మము-పాడైపోలేదు
పాతబడుటచే అదియెంతయును_పథ్యంబేయగును
ఉప్పుతగినంతవేయనెప్పుడైన ఊరుగాయచెడునే
చెమ్మతగిలిననాడే అదిపస-చెడిపోవును గాదా
అట్లేమనధర్మమునన్ ప్రకృతికి-అనుకూలములైన
విషయములే నిండియుంటచేతను-వృధకాదెన్నటికి
పాతబడుటచే అదియెంతయును పథ్యంబేయగును
కానిదానిని మార్పగబూనిన-కలుగును మోసమ్ము
కావునధర్మము మార్చుటకెన్నడు-భావింపగవలదు
జీవితపథమున నుత్తమలక్ష్యము-జేరగబూనండి॥

వ॥ పైవిధముగా మహోత్కృష్టమగు పద్ధతులతో నాగరికత కాలవాలమైనది మన భారతదేశము,

ఇట్టి దేశమున దురదృష్టమున-బుట్టినారు నేడు
ఇమిటేషనువాదులు కొందరహో-ఇంగ్లీషుప్రియులు
వీరిచేష్టల వర్ణించుటకు-నేరరెంతవారు
భారతాంబను పాశ్చాత్యులకు-బానిసచేసెదరు
మన-ఆచారాలుచూచి నవ్వేరు
మన-వేషభాషల వెక్కిరించేరు
తెల్ల-దొరలకు తొత్తులైపొయ్యేరు
నల్ల-వారు నరులెకారని తలచేరు
ఏ,బి-సి,డీ,లె ఘనమని మెంచేరు
వేద-శాస్త్రాల చులకనజేసేరు
వచ్చి-రానిచదువులకే మిడిసిపడియేరు
పచ్చి-బూతులె వాదనజేసేరు
స్వంత-డబ్బాలు బాగా వాయించేరు
స్వకుచ-మర్దనమె ఎల్లపుడుచేసేరు

## ఫ్యాషను

వ॥ ఇక వీరి ఫ్యాషన్లు చూడగా:-

పిల్లల నిల్లొలిసీమాడ్చి హోటల్కు-వెళ్ళుటొక్క-ఫ్యాషన్
పిల్లికూనలను కుక్క-పిల్లలను-పెంచుటొక్క-ఫ్యాషన్
కండ్లుపోవునట్లుగ సినిమాలను-గాంచుటొక్క-ఫ్యాషన్

కండ్లకుజోడు ధరించుటొక్క - ఘనమైన ఫ్యాషన్
సిగరెట్‌పొగలనుమి్రంగుట ఇతరుల - పొగచుటయును ఫ్యాషన్
క్రాపింగులు పెంచుటయే నేడు - గట్టిఫ్యాషనండీ
శిఖాధారులను వెక్కిరించుటే - సివిలిజేషనండీ!
శిశువులగనకుండ కాంట్రాసెప్టివ్ - సేవించుట ఫ్యాషన్
చంటిపిల్లలకు పాలివ్వక గ్లాక్సో - వెంటబడుట ఫ్యాషన్
మొగాలనిండా బూడిదగొట్టుట ముఖ్యమైన ఫ్యాషన్
పెదవులు, గోళ్ళకు రంగువేయుట - పెద్దఫ్యాషనండీ
పండ్లపీకివేయించి కుక్కబొమికె - పండ్లుగట్టు ఫ్యాషన్
మీసాలకు, జుట్టునకు రంగులు - మెత్తుటయును ఫ్యాషన్
తలనిండా మేకులుగుచ్చుట పని - తలకిప్పుడు ఫ్యాషన్
చంకలలోకి జాకెట్లుతొడుగుట - సతులకిపుడు ఫ్యాషన్
అర్థములేని కవిత్వముచెప్పుట - అది మరియొక ఫ్యాషన్

వ॥ ఆకవిత్వము ఎట్టిదనగా:—

# భావకవిత్వము

చెట్టుమీద రెండుకాకులు తం॥
చెట్టుకి్రంద రెండువాగులు ,,

**మే కు**

ప్రేయసిని గూర్చి తం॥
ఆలోచిస్తూ నేను ,,
గోడకానుకొగా ,,

గుచ్చుకొనె వీపుకు. ,,
ఇంత ఓర్వరానితనము ,,
ఎందుకీ మేకుకూ? ,,

<u>ఉల్లిపాయ</u>

ఉల్లి చేసిన మేలు తం॥
తల్లైన చేయదు ,,
ఒక్కటొక్కటిగా ,,
ఒలిచితె పొరలన్ని ,,
ఏమి మిగులబోదు ,,
ఇంతకు దీనిలో సారము ,,
యేమి యున్నదోను? ,,

వ॥ ఇంకా, చాలిచాలని రైక, కొబ్బరి పచ్చడి, గుత్తివంగాయ కూరమొ॥ విషయాలెన్నో ఉన్నవి.

ఈవిధంబుగా చెప్పెదరెందరో-భావకవిత్వంబు
భావమేమియును లేనియట్టిదే-భావకవిత్వంబో?
అర్థమేలేని కవిత్వమెట్టి-యభ్యుదయకరంబో,
కొత్తిమిరవలె వాసిపొయ్యేటి-కొత్త కవిత్వాలు
"కొత్తిమిరికవిత్వా"లని"యాధ్రిరత్న"-ఘోషింపగలేదా?

వ॥ ఈవిధమైన నిరర్థక"కొత్తిమిరి" కవిత్వములను చెప్పుటయును, పైగా "నన్నయలో ఆ దోషమున్నది, తిక్కనలో ఈదోషమున్నది" అని దూషించుటయును ఏమియు తెలియక పోయినను అంతయు తెలిసినట్లుగా మాటలాడుటయును అన్ని

టికంటె పెద్ద ఫ్యాషన్ అయిపోయినదండీ! అంతటితో నాగరిక మిగిలిన ఏ నాగరిక భాషలోను పోడసూపని గ్రామ్యగ్రాంధిక భాషావాదమును "ఇటాలియన్ ఆఫ్ దియీస్టు" అనియును, "దేశభాషలందు తెలుగు లెస్స" అనియును అసమానప్రఖ్యాతిగాంచిన ఆంధ్రభాషకంటె గట్టి భాషను వికారపరచివేయుచున్నారు

# గ్రామ్యగ్రాంధిక భాషావాదము

సకలభాషలకు జననియైనయా-సంస్కృతమున బుట్టి
"దేశభాషలందు తెలుగులెస్స"ని-దివ్యకీర్తి గాంచి,
"ఇటలియనాఫ్ది యీస్టని పరులచె-ఎంతో నతిగాంచి
అతిమనోహరములౌ గ్రంథములచే-నమలయశము గాంచి,
వెలుగుచుండుమన తెలుగుభాషకిక-గలదె సాటియెందు?
ఇట్టిభాషను చేటొనరింపగ-నేగుదెంచినారు
సంస్కారంబను పేరునభాషను-చంపివేసినారు
గ్రామ్యవాదమను మిషతో భాషను-గడ్డగొట్టినారు
"గిడుగు" మొదలైనవారలు భాషకు-పిడుగులైనారు
సలక్షణమైన భాషావ్యాప్తికి-సైంధవులైనారు
వీరికెదురుగా నాంధ్రపండితులు-చేరిపోరినారు
కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి-ఘనమైనవాడు
కొక్కొండ వేంకటరత్నము పంతులు గొప్పయైనవాడు
జయంతి రామయ్యపంతులుగారు-సాటిలేని మేటి
ఇట్టిమహామహులెందరో భాషా-వృద్ధికోరినారు

కోరు పైమాత్రము కాదు ప్రయత్నము-కూడ చేసినారు
వారిచలవవలననే యింక మన-భాషయిట్లునిలచె
కాన వారికాంధ్రులు కృతజ్ఞులే-కావలయునుసుండి
వారిబోధనల వినిమనభాషా-ప్రశస్తినిలుపండి
వ్యాకరణసిద్ధమైన భాషనే-వాడుటనేర్వండి
అన్నినాగరిక భాషలపద్ధతి-నరసిచూడరండి
అందుగ్రాంధికము, వ్యావహారికము ననుచు వేరెయుండు
వ్యావహారికము వ్యాకరణదుష్ట-మగుచునుండునెప్పుడు
కావునదానిని వాడరెవ్వరును-గ్రంథములందునను
గ్రాంధికభాష జనులకర్థము-కాదనుటయె కల్ల
సులభమైన శబ్దములువాడగా-తెలియునందరకును
గ్రామ్యభాషలో నైననుశైలి-కష్టముగానున్న
తెలియదెంత చదువరులకైనను-తేలికగానదియు
ఈవిషయము గమనింపక-భాషనుఏడిపించినారు
విజాతీయపద్ధతులచే భాషను-వికారపరచారు
సలక్షణమైన భాషయెజనులకు కలుగకుండపోయె
విలక్షణమైన భాషతో కాలము వెళలబుచ్చవలసె
ఇంతటనైన నిజముకనుగొనిన-నెంతో మేలుకలుగు
మంచి తెనుగునువాడి భాషకు-మన్నికగూర్చండీ,

వ॥ పైవిధముగా తెనుగును వికారపరచి, ఆంధ్రవ్యాకరణమును అంతరింపచేసి, అంతటితో తృప్తిపడక, మిగిలిన ఆంధ్రభాషనుకూడ చంపివేయుటకై హిందీ, ఉర్దూలు రెండింటినీ మన దేశభక్తులు మననెత్తిమీాద నిర్బంధించి రుద్దుతున్నారండీ!

ప్రపంచభాషగనుకాంగ్లము నేర్వంగావలెనండీ
రాష్ట్రభాషకావున హిందీ నేర్వంగావలెనండీ
పాకీస్థాను భాషకానసురుద్దా-భాషను నేర్వవలెగా
దిక్కు మొక్కు లేనిదికావువను-తెలుగక్కర లేదు

వ॥ ఈవిధముగానున్నది మన ఆంధ్రుల భాషాపోష ణము. దేశభాషయగు తెనుగుగతియే యిట్లున్నచో, నిక యావద్భారత మాతృభాషయగు సంస్కృతముమాట వేరే చెప్పనక్కర లేదు:

## సంస్కృతము

ప్రపంచమందెన్నో భాషలకు మాతృ-భాష సంస్కృతమ్మే
ప్రపంచమందలి భాషలన్నిటను-భవ్యమైనభాష
ప్రపంచమందలి భాషలన్నిటను-ప్రధానమగుభాష
విశ్వమందలి ప్రథమగ్రంథమగు-వేదమున్నభాష
ఉత్తమమైన గ్రంథములెన్నో-యున్నవింములోను
శాస్త్రరహస్యము లేనోయున్నవి-సంస్కృతమందునను
జర్మని, రష్యా మున్నగుపరదే-శములు నేర్చుచుండె
కానిమన దేశమున నిపుడు దీని-గౌరవించు లేది?
మద్రాసుప్రభుత్వమువారు దీని మాటుపరచినారు

వ॥ అదెట్లనగా సంస్కృతమును "గ్రూప్"గా తీసి కొనిన విద్యార్థులు ప్రభుత్వోద్యోగముల కనర్హులని వారు ప్రక టించియున్నారు. అందుపై మన భారతీయులు పెదనైన

మెదపలేదు. ఈవిషయమున దేశభక్తుల దేశభక్తి అంతయు ఏమైపోయినదో తెలియదు.

ఇంతటనైనా జాగరూకులై-హితమును తెలియండీ
సంస్కృతభాషా ప్రాశస్త్యమ్మును-చక్కగ తెలియండీ
దానినభివృద్ధిపరుపగా ప్రియ-త్నమ్మును చేయండి

వ॥ "ప్రకృతమనుసరామః। పాయసం భక్షయామః"
అనునట్లుగా మన దేశస్థితి విషయ మటుంచి, యిక ప్రకృతవిషమునకు వత్తము. హరిహరరాయలకు బుక్కరాయలకును శ్రీ విద్యారణ్యులవారు తుంగభద్రానదీ ప్రాంతభూమియొక్క సహజ మాహాత్మ్యమును చెప్పినంతనే వారు అచట విద్యానగర నిర్మాణమును ప్రారంభించినారు.

అని తెల్పగ వారంతట సులగ్న మున నారంభించి
విద్యానగరము వెలయించిరచట విభవముతోడుతను
ఆమహానగర విభవము నిన్నచూ ఆశ్చర్యముగలుగు
పదునాల్గుమైళ్ళ పొడుగువానగరికి-పదిమైళ్ళ వెడల్పు
ముప్పదిలక్షల జనసంఖ్యతోడ మచ్చటగుచునుండె
తూర్పునకృష్ణశిలాపర్వతంపు-తోరణములతోడ
రామదుర్గగిరులు దక్షిణోత్తరముల వెలయుచుండ
తుంగభద్రాస్రవంతిప్రక్కనే-తొంగిచూచుచుండ
సస్యశ్యామల శోభితంబులౌ-చక్కని పొలములతో
ఎన్నికగన్న పారిశుధ్యంపు-టేర్పాటులతోడ;
విశాలమైన రాజవీథులతో-విపణులతోడుతను
దివ్యకళాసంశోభితంబులౌ-దేవాలయములతో

చక్కని కేళాకూళులతోడను-సభాభవనములతో;
రమ్యహర్మ్య సంఘములతోడను-రథ్యలతోడుతను
చుట్టు నేడు ప్రాకారంబులతో-సొంపుమీరియుండె
కళకళలాడుచు నాపురి లక్ష్మికి కాపురమైయుండె
బురదతో నిండియుండువీధు లా-పురమందేలేవు
దోమలకిరవౌ మురికిగుంట లం-దున నెచ్చటలేవు
వీధిమధ్యమున కసాయంగడులు వెదకిన లేవచట
అట్టిమహోత్తమమైన పురమువి-ద్యానగరవరమ్ము
ఆవిద్యానగరమునను శ్రీవి-ద్యారణ్యుండపుడు
ఘనముగ హరిహరరాయలకంతట-గట్టెనుపట్టంబు
బుక్కరాయలను మంత్రిజేసెను-పూజ్యయతీంద్రుండు
"ధనమూలమిదంజగత్తను" సామెత క్షితిలోకలదు
కావున ధనమునకై ప్రయత్నముగా-గావించిరివారు
యతీంద్రులపుడు దివ్యదృష్టితో-నాలోచించారు
కిష్కింధానగరమున మునుపు సు-గ్రీవుడుదాచినవి
ధనపుపెట్టెలను కొన్నిటిబయటికి-తరలించినారు
అంతటవారు గ్రామగ్రామమున-కరుగసాగినారు
జనులలోను ధర్మప్రచారమును-సలుపసాగినారు
ప్రజలలోను చైతన్యము వృద్ధి-పరుపసాగినారు
విద్యారణ్య యతీశ్వరులిట్లు-విశదపరచినారు
"జనులారా! నేచెప్పెడుమాటల-శ్రద్ధతోడ వినుడీ!
ధర్మముచేతనె లోకములన్నియు-ధరింపబడునండీ,
ధర్మమునందే అర్థకామములు-దాల్పవలయులండీ,

ధర్మమందు నేమనుజుడులక్ష్యము-తప్పకూడదండీ
ధర్మమువదలిన లోకములన్నియు-తల్లకిందులౌను
ధర్మమువదలిన శాశ్వత శాంతికి-తావులేదుసుండీ
స్వధర్మ పరధర్మంబులయొక్క-జాడను తెలియండీ
శృతిస్మృతులలో జెప్పినధర్మని-శిష్టత తెలియండీ
అనాదియా మనధర్మములే మీ-రాదరింపరండీ
సనాతనంబౌ ధర్మముమనది-శాశ్వతంబుసుండీ
అనుపమానమౌ మహాత్మ్యమిందే-అమరియున్నదండీ
అనేకప్రకృతి శాస్త్రరహస్యము లమరియున్నవండీ
దివ్యద్రష్టలౌ మహర్షులుప్రసా-దించినధర్మంబు
అనేకయుగములు హైందవులనుకా-పాడినధర్మంబు
అట్టిధర్మమును ఆదరించుటకు-అశ్రద్ధవలదండి
ధర్మదూరులౌ పరకీయులు మన-తావుచేరినారు
మనమతధర్మములను బోకార్చెడు-పనులుచేసినారు
గోహత్యలచే శిశుహత్యలచే-కొల్లగొట్టినారు
స్త్రీలమానముల నెంతోఘోరముగ-చెరిచివేసినారు
దేవాలయముల నేలమట్టము-గావించినారు
రత్నరాసులను కొల్లలుగాను-రవాణచేశారు
శాస్త్రగ్రంథాగారములగ్ని-జ్వాలల దోశారు
ఇట్టిపరస్థితి యిట్లేయుండిన-హిందూత్వమెపోవు
జాతినశించిన వెనుకనుమనకిక-సార్థకమేమండి
కావునమీరిక నిద్రింపగా-కాలముకాదండీ
కండ్లుతెరచిమన శాస్త్రమహాత్మ్యము-గమనింపగరండీ

మనహిందూమత పునరుద్ధరణం-బున కే లేవండీ
ప్రపంచమునకే గురుపీఠమున-భారత దేశమ్ము
ప్రపంచమునకే గురువుమనమనువు-బహుదొడ్డవాడు
మనకితరులపై ద్వేషములేదు-మనసునందుకూడ
కానిమనము మనమతరక్షణకై-కడగవలయునండీ
కావునప్రజలారా! రండుమీరు-కార్యరంగమునకు;
విజయనగరసామ్రాజ్య సైన్యమున-వీరులు చేరండీ!
భారతధర్మోద్ధరణకు ప్రాణాల్-బలిగానివ్వండీ?
ఉత్తరకుమార ప్రజ్ఞలకొట్టె-యువకులువద్దండీ
వృద్ధులైనసరె; భీష్మునివంటి-వీరులెయిటరండి!
మీభుజములపై హిందూమతపు-శోభయున్నదటండీ!
మీమనసులలో హిందూధర్మపు-సేమము న్నదండీ!
రండురండిపుడె వచ్చెడివారలు-రయమునరండయ్యా
పొండుపొండు రానొల్లనివారలు-భూగర్భముకోకి!
అనియిటు విద్యారణ్యయతీంద్రు-డతిగంభీరముగా
చెప్పినతోడనె వేనవేల్ప్రజలు-సేనలందుచేర
భారతధర్మోద్ధరణమునకునై-ప్రతినవట్టిరండీ!
శ్రీ యతీంద్రుల బోధనువినిన-స్త్రీలుకూడనపుడు
వీరరసంబది పొంగిపొరలగా-విక్రమయుతలైరి;
సైన్యమందునచేరి శత్రువుల-జక్కాడెదమనిరి;
ధీరత్వముతో సత్యభామవలె-పోరొనర్తుమనిరి;
దేశముకొరకై ప్రాణములైనా-తీసియిత్తుమనిరి;
ధర్మముకొరకై సర్వమునైనా-త్యజియింతుమనిరి;

అంతనా సతీమణుల సాహసం-బెంతో మెచ్చుకొనుచు
శ్రీవిద్యారణ్యు లప్పుడిట్లు-చెప్పిరివారికిని:—
"అమ్మలార! మీ ధైర్యశౌర్యములు-అసమానములేను,
పరాశక్తికి అంశలైనమీ-ప్రతిభ తెల్పతరమా?
ప్రకృతిస్వరూపుణులై వెలసినమీ-ప్రజ్ఞబల్కవశమా?
అసమానంబగు మృదుత్వకాఠి-న్యము^లు కలవు మీలో,
దయకుఁ; ఓప్పునకుఁ, మీసాటి-ధర నెవ్వరుకలరు?
వానిని చక్కఁగవిని యోగించిన-వర్ధిల్లునుజాతి;
జాత్యభివృద్ధికి మూలకందములు-సతీమణులేసుమ్మా!
యుద్ధమన్నచో ఘోరకృత్యమది-యువిదలకును తగదు;
హత్యాకాండకు బూనుటమహిళల-కకృత్యమగునమ్మ
పురుషు లసమర్థులైన నేసతులు-పోరికేగవలయు
పురుషులపనికి స్త్రీలువచ్చిన-మోసమువాటిల్లు;
పురుషునితో నే వంతుపెట్టుకొని-పోరవలదుమీరు;
పురుషులుచేసెడు పనికై మీకు-పోటీవలదమ్మా;
భగవత్సృష్టినిబట్టి యెవరిపని-వారుచేయవలయు;
అందుచేత నే ధర్మమువృద్ధి నందుచుండునమ్మా!
ధర్మవృద్ధిచేత నే దేశమం-తయునువృద్ధిజెందు;
సృష్టిలో మీకొక విశిష్టమైన-కృత్యమున్నదమ్మా!
గృహరాజ్యంబునకు సర్వాధికా-రిణులు మీరేసుమ్మా!
గృహపాలనమం దెంతో భారం-బిమిడియున్నదమ్మా!
భావిసంతతికి వరవళ్ళుదిద్దు-పనిమీదేనమ్మా!
ఇదియే జాత్యభ్యున్నతికిముఖ్య-హేతువగునుసుమ్మా?

కావునమీరు గృహిణీధర్మము-కాపాడగబూండు;
భావిభారత సంతతిఁ ధర్మ-వంతులజేయుండు;
భావిభారతకీర్తిలతను-పాదుచేయుడమ్మా!

వ॥ అని యీప్రకారముగా శ్రీ విద్యారణ్యుల వారు అప్పటి భారత వీరనారీమణులకు బోధించి, వారిని శాంతపరచి వారి వారి స్వకృత్యములందు ప్రవర్తింపజేసిరి. కాగా.—

స్త్రీకి గృహరాజ్యమే ముఖ్యలక్ష్య-సిద్ధిక్షేత్రమ్మ;
స్త్రీయే కుటుంబ సౌభాగ్యమునకు జీవగఱ్ఱ; నమ్మ;
అందామెను తొలగించివైచిన-హానికలుగునమ్మ;
ఇది తెలియనివారు స్త్రీలరచ్చ-కీడ్వసాగిరిపుడు;
పురుషులు స్త్రీలు సమానులేయని-బోధనజేసెదరు
అట్లుచూచిన సృష్టియంతయు-అభిన్నమే కాదా?
యెలెక్ట్రాన్లు, ప్రోటాన్లుకాకను-ఏమికలదు వేరే?
అందరుఁ సమానమేయైనచో-వ్యవహరించుటెట్లు?
అందరుపల్లకి ఎక్కెడువారే-యైనమోయుటెవరు?
అందరుతినువారేయైన వండు-నట్టివారలెవరు?
పిల్లలందరిపై సమప్రేమయే-తల్లికుండుగాదా?
అయినసందరకు నొకేప్రమాణపు-ఆహారంబిడునా?
ఎవరియీడునకు తగినంతయన్న-మిడునుగాదెతల్లి?
అంతమాత్రమున ఆమెప్రేమకు-ఆక్షేపణకలదా?
అట్లైనసృష్టిలో భిన్నప్రకృతులు-అమరియుండునెపుడు;
అందరుసమానులే యనిచెప్పుట-అవివేకమెయగును;
ప్రకృతులబట్టి ఏర్పడియుండును-వారివారిపనులు;

వానినివదలి వేరుపనులకు-బూనచేటుగలుగు;
స్త్రీపురుషుల ప్రకృతులొక్క-టేనని-చెప్పగలరమీరు?
స్త్రీలకు పురుషులకంటె తక్కువయె-దేహబలముసుమ్మా;
ఋతుదోషంబులవలనను వారికి-రుగ్మతలెక్కువయే;
శారీరక శాస్త్రంబేయిందుకు-చక్కనిసాక్ష్యమ్మా;
మానసికముగా స్త్రీలె బల-హీనలుధరలోన;
దృష్టాంతమునకు చూడవచ్చును "హిస్టీరియ"వ్యాధి
స్త్రీలకెవచ్చునుగాని పురుషులకు-చెందుటవినమెందు;
కాననెవారి "కబల"లనుపేరు-గలిగియుండెభువిలో;
అప్రాచ్యులును స్త్రీలకు "ఫెయిర్సె-క్స"నియేపిలిచెదరు;
కాన "సైన్సు"తెలియకయె అందరొ-క్కటనిచాటవలదు;
పురుషులతోనే వంతుపెట్టుకొని-పోరరాదుస్త్రీలు;
అట్లుపోరిన జాత్యభివృద్ధికి-హానికలుగుచాల;
ఇదియెరుంగక స్త్రీలనురచ్చ-కీడ్వసాగిరిపుడు;
అప్రాచ్యపద్ధతులపై స్వైరవి-హారముబెంచెదరు;
కుటుంబజీవనముపై స్త్రీలకు-కోరికచంపెదరు;
స్త్రీలమనస్తత్వమ్ము తెలియకయె-చిందులుతొక్కెదరు;
పొట్టకూటికై స్త్రీపురుషులకు-పోటీపెంచెదరు;
అన్యోన్యసామరస్యమనుచునే-అల్లరిపెంచెదరు;
పురుషులచదువే చదివించిస్త్రీల-పురుషులజేసెదరు;
పురుషులకైనా పనికిరానిది-ప్పుడున్నట్టిచదువు;
నౌకరీలకై ప్రాకులాడెడు-వరులబెంచుచదువు;
పొట్టకూటికైనా పనికిరాని-బుద్ధిలేనిచదువు;

బానిసతనమును ఎక్కువ చేసెడి-ప్రస్తుతంపుచదువు;
ఆధ్యాత్మికసంపదయే బెంపని-యట్టివట్టిచదువు;
నాయకులందరు పనికిరానిద-న్నట్టినేటిచదువు;
నిష్ప్రయోజనంబైన యీచదువు-నేర్వనేలస్త్రీలు?
పురుషులకేపనికిరాని చదువుకు-పోవనేలస్త్రీలు?
పురుషులతోడ పోటీపడుటకు-బూననేలస్త్రీలు?
ఇదిదేశాభ్యుదయమునకుకారణ-మెన్నడైననగునా?
స్త్రీలకిట్టిచదువేలనన్నచో-చెడ్డవారలైరా?
స్త్రీలబానిసల చేసెడివారలు-దేశభక్తులైరా?
మనస్త్రీలకెప్పుడైన గలదెనిజ-మైనచదువుకలవు?
వేదశాస్త్రముల నెచటనైనస్త్రీ-విద్యకూడదనిరా?
వెనుక నిప్పుడును, ఎందరోస్త్రీలు-విద్యనేర్వలేదా?
ఎందరోస్త్రీలు గ్రంథరాజముల-నెన్నోవ్రాయలేదా?
శివాజితల్లికి మనసంస్కర్తలె-చెప్పించిరెచదువు?
కుమ్మరిమొల్లకు మనసంస్కర్తలె-గురువులైరె? నాడు
చదువులోనిమర్మ మెఱుగనేరరు-సంస్కర్తబ్రువులు
చదువనగా "ఏ, బీ, సీ, డీల"ని-సంతసింతురండి,
చదువనగా వ్రాత, కోత, మాత్రమె-కాదు, చూడరండి,
చదువనగా లోకజ్ఞానంబది-సామాన్యముకాదు;
శివాజితల్లి "బి ఏ," ప్యాసు-జేసియుండెనేమి?
కుమ్మరిమొల్ల "ఎం, ఏ," పట్టము-గొనియుండెనె, నాడు?
లోకజ్ఞానము చేతనెవారువి-వేకయుక్తలైరి;
"స్త్రీకివిద్యచెప్పించక బానిస-జేయుచుండి"రనుచు

సనాతనుల నిందించువారలు—సలిపెడి పనియేమి?
చదువననేమో యెరుగనికూట-సంస్కర్తలుస్త్రీని
పనికిమాలిన చదువులతోడ-బానిసజేసెదరు;
కుటుంబపోషణమునకై పురుషుడు-కూలిచేయుగాదా?
అటులేస్త్రీ గృహకృత్యములు చేసి-నంత బానిసగునే?
బాగుగ చదివినపూర్వపుస్త్రీలు-వంటచేయలేదా?
భర్తకుపిల్లల కన్నము బెట్టుట-బానిసతనమగునా?
ఇట్టికుయుక్తులచే సనాతనుల-హేళిజేయువారు
తమ్ముదామె వంచించుకొనుటయగు-సుమ్మునిజముగాను
మంచి సాంఘికపద్ధతులు తారు-మారుచేసెదరు
విచ్చలవిడిగా తిరుగుచుంటయే-ప్రేమయందురండీ;
వ్యభిచారము నభివృద్ధిపరుపగా-బాటలువైచెదరు;
స్త్రీలమనస్తత్వమ్ము తెలియకయె-చిందులుత్రొక్కెదరు;
అప్రాచ్యపద్ధతులపై స్వైరవిహారము బెంచెదరు;
కుటుంబజీవనముపైన వారికి- కోరిక చంపెదరు;
వివాహవిధియే అనవసరంబని-వెట్టిగబల్కెదరు;
పెండ్లియె లేనిచో మానవసంఘపు-పెద్దరికమె లేదు;
మనుజసంఘమునకుఀ వివాహమే-పునాదిజనులార!
సాంఘికవ్యవస్థకిదియె మూలమా-సంస్కారంబండీ!
పశుప్రవృత్తిని పారద్రోలెడి-పద్ధతిదేనండీ!
నాగరికత కాలవాలమైనద-నాదినుండిసుండీ!
ఆధ్యాత్మికపథ ప్రయాణమునకును-యానసాధనంబు;
స్వల్పజ్ఞులకిది యర్థముకాదు-సంపూర్ణముగాను;

కామతృప్తి కొరకే వివాహమని-కాముకులతలంపు;
కామతృప్తియే వివాహలక్ష్యము-కాదెన్నటికైన;
పెండ్లిలేకయే తిరుగవచ్చును-విచ్చలవిడిగాను;
"నీతిజాతు" లను శబ్దంబులనే-నీటగలుపవచ్చు;
అప్పుడు మనుజుడు పశువుకంటె తా-నధికుడెట్టులగును?
ఆతనిబుద్ధివిశేషమువలని-యాధిక్యతయేమి?
కావునపెండిలి పశుప్రవృత్తికే-కాదెన్నటికైన;
ఆర్థిక ధార్మిక సాంఘిక విధులం-దమరియున్నవండీ;
కావున పెండ్లిని బేరముగాను-భావింపకరాదు,
కావున పెండ్లిని "కంట్రాక్టు"లలో-గలుపగూడదండీ!
ఆధ్యాత్మిక బంధములేని పెండ్లి-అనవసరమెయగును;
అట్టిపెండ్లి "మూణ్ణాలముచ్చట"యె అగుచునుండునెపుడు;
పెండ్లియైన మరునాటినుండియును-"విడాకు" లకు వీళ్ళు
వెదకుచుండు దంపతులకాపురము-వెలుగు "భగ్గు, దుమ్ము"
ఇట్టి పెండ్లికిని, పశుప్రవృత్తికి-ఏమిభేదమండి?
"వివాహ" మనగా పవిత్రవిధి; స్వ-ర్విహారసాధనము;
అదియెఱుగక "రిజిష్టరు" పెండ్లిం-డ్లారంభించారు;
అందువలన నాధ్యాత్మిక దృష్టియె-అంతరించిపోయె;
విడాకులను దుష్టపద్ధతికిని-విలువహెచ్చిపోయె;
అందువలనను కుటుంబవృద్ధికిని-హానికలుగుటాయె;
అందుచేత సంఘనాశనమునకు-అవకాశము హెచ్చె;
విడాకులవలని కష్టముల నిచట వివరింపగలేము; అబ్బా!
పాశ్చాత్యులె యీపద్ధతిచె బాధ-పడుచున్నారండి;

నిత్యము వందలకొలది కాపురాల్-నీటగలియుచుండె;
సంతానమునకు తల్లి ప్రేమగను-సౌభాగ్యమెపోయె;
అనాధ శరణాలయమ్ములంత-కంతకెక్కువాయె;
పాశ్చాత్యసంఘ జీవనమె పాడు-పడిపోయినదండీ!
దాని "మరమ్మతుకై" వారు ప్రయ-త్నములు సేతురండీ!
ఏమిచేయుటకును తోచక పం-డ్లిగిలించెదరండీ!
అట్టి "కుళ్ళుగుమ్మడికాయక్" మన-మాశ్రయించు టేల?
వారు వదలగోరిన దాని మనము పట్టుకొనుట మేలా?
కండ్లుండియును గ్రుడ్డివారలై-కానరు మనవారు,
వీనులుండియును చెవిటివారలై-వినరేమనవారు!
పాశ్చాత్యులలో "ప్రేమపెండ్లిండ్లె"-ప్రబలముగద, బాబు!
అట్టిచో వివాహ విచ్ఛేదనమున-కవసరమేముండి?
కాని, అచ్చటను విడాకులసం-ఖ్యాకములేకాదా?
దీనినిబట్టి చూడగమనకు-తెలియున దేమనగా:-
ఇప్పటి ప్రేమవివాహములనునవి-వృధాభ్రాంతియేను;
పూర్వపు ప్రేమవివాహమ్ములతో-పోలికయే లేదు,
పూర్వము ప్రేమకు గుణసంపదయే-మొదటిహేతువయ్యె;
ఇందువలననె పూర్వము విడాకు-లెందు గానరావు.
అప్పుడు పాతివ్రత్యంబేఘన-మగుచు వినుతికెక్కె;
సీతా, సావిత్రి, దమయంతీ-సతుల చరిత్రములన్
కనుపడునట్టిది పాతివ్రత్యపు-ఘనమహిమయె కాదా?
పద్మిని, మీరా, లవంటి మహిళల-భవ్యచరిత్రములన్
కనుపడునట్టిది పాతివ్రత్యపు-ఘనమహిమయె కాదా?

భర్తలవలన గనిరి వీరెన్ని-కష్టపరంపరల?
పాతివ్రత్యము చానిసతనమని-భావించిరె వీరు?
వీరందరును అజ్ఞానలనుచు-నేరుచెప్పగలరు?
వీరందరు అవివేకలనుచును_ఏరుచెప్పగలరు?
ప్రాణముకంటె మానమె అధికం-బని వీరెంచారు;
బ్రతుకుకంటెను కీర్తియె శ్రేష్ఠం-బని వీరెంచారు;
ఇట్టి శీలము, ఇట్టిమానము-ఇపుడు పనికిరావా?
వీరికంటె మనకాదర్శమైన-భారతసతులేరీ?
పాశ్చాత్య స్త్రీలవలె స్వైరిణుల-ప్రబలజేయవలెనా?
ప్రాచ్య పాశ్చాత్య సంఘవ్యవస్థ-లందుమనదె ఘనము,
ఈ విషయము పాశ్చాత్యులెందరో-ఎఱిగియె యున్నారు;
ఎఱుగుటె కాదు, చాలసార్లు ప్రక-టించియె యున్నారు;
అయినను మనకు ఇవిలేవన్లే-అధికమాయె నిపుడు;
"ప్రేమవివాహములే" మనకుకూడ-ప్రియమాయెనుఇపుడు;
పూర్వము ప్రేమకు గుణసంపదయే-మొదటిహేతువయ్యె;
ఇప్పటి ప్రేమకు గుడ్డిదైన కా-మేచ్ఛయె కారణము;
అప్పుడేటుజంటల కింతకంటె-ఆదర్శములేదు;
అందువలననే యిప్పుడు విడాకు-లధికమగుచునుండె;
బాల్యవివాహములను వదలిపెట్ట-ప్రారంభించితిమి;
బాల్యవివాహముల వల్లనే కడు-ప్రబలును ప్రేమంబు;
బాల్యస్నేహితులందే స్నేహము-ప్రబలియుండు మిగుల;
బాల్యస్నేహమును మించు స్నేహ-బంధమేది ధరలో?
చిరపరిచయమ్ములవలన మనస్సున-స్నేహబంధ మమరు;

యౌవనప్రాప్తి సమయంబునకును-అన్యోన్యత గలుగు;
ఇందువలనను కుటుంబయాత్ర-ఇంపుగానుసాగు;
ఈ కారణమున సాంఘిక సమరస-మెక్కువగుచునుండు;
ఈ రహస్యమును గమనింపకయే-యీసడించుతారు;
బాల్యవివాహములను దయ్యంబుల-వలె భావించెదరు;
వీనివలన జాత్యారోగ్యమునకు హానికలుగుననుచు
పలుకువారలీ యుద్ధమందలి-భారతీయప్రతిభా
సాహసధైర్య శౌర్యంబులను-చక్కజూడరయ్యా!
ప్రపంచమం దసమానకీర్తి భా-రత వీరులు కనిరి;
ప్రపంచమందున్ మన నాయకులు-ప్రసిద్ధిపొందారు;
వీరందరును బాల్యవివాహపు-పిల్లలేకద! బాబు!
ప్రసిద్ధినందిన "ష్లేషైరు" వంటి-పండితులందరును
బాల్యవివాహములే మంచివనుచు-ప్రశంసించినారు;
బాల్యవివాహములవలన విధవలు-ప్రబలిపోదురనుట
బుద్ధితక్కువయె; పెండ్లివలన చని-పోవువారుగలరే?
ఆర్థిక సౌభాగ్యం బెక్కువైన-ఆరోగ్యము హెచ్చు;
ఆరోగ్యంబది యెక్కువైనచో-ఆయుష్యము హెచ్చు;
అప్పుడు విధవలు తగ్గెదరు కాని అంతవరకు కాదు;
కావున బాల్యవివాహమ్ములుచెడు-గని యెంచగరాదు;
బాల్యవివాహమ్ముల వదలినచో-వ్యభిచారము పెరుగు;
అందున "సినిమా" వలనన్ కామ-మ్మతిశయించు నేడు;
అమెరికన్ జడ్జి "లిండ్సే" వచించి-నట్టిహాని హెచ్చు;
రెడీమేడ్ భార్యలకైనా ధా-ర్మికత వదలవలదు;

అంతా యిప్పుడు రెడీమేడ్ జగ-మై పోయినదండీ;
సుంతైనా ఓపిక లేదిప్పుడు-చూడగ జనులందు
రెడీమేడ్ దుస్తులు, ఫలహారాలు-రెడీమేడ్ కవితల్,
రెడీమేడ్ భోజనాలు, కిల్లీల్-రెడీమేడు భార్యల్,
రెడీమేడ్ సంతానాలండీ-రెడీమేడబద్ధాల్,
రెడీమేడ్ పోలీసు కేసులు-రెడీమేడ్ చదువుల్,
రెడీమేడు భార్యలకోరకై ధా-ర్మికత వదల వలదు;
విధవల పెండ్లిండ్లవసర మనెదరు-వెఱ్ఱివారలండీ,
అందువలన పెండ్లికాని కన్యలు-అధికమగుటలేదా?
విధవల వలనన్ వ్యభిచారమ్ము-పెరుగుననుట ఏల?
సధవలైనను కాముక స్త్రీల-సంగతియదెకాదా?
వర్ణాంతర వివాహమ్ములచే-ప్రబలునైక్యమనుట
వట్టిది; బంధువులందు పరస్పర-వైరమ్ములు లేవా?
స్త్రీస్వాతంత్ర్యము లేకయె స్వరాజ్య-సిద్ధి కలుగదనుట
వట్టిది జర్మనివంటి దేశముల-పాట్లుచూడలేదా?
ఇట్టిదుష్ట పాశ్చాత్యానుకరణ-మేలనండి? మనకు;
ఆర్షనియమముల నతిక్రమింపక-అభ్యుదయముగనుడీ!
సృష్టికి పాపపుణ్యాలకారణము-స్త్రీయే చూడండీ,
స్త్రీదోషంబున వర్ణసంకరము-జెందు ననెడుగీత;
ఆమెయందు గలిగిన లోపమ్ములు-అతిసూక్ష్మములైన
సంతానంబున ప్రతిఫలించునవి-ఎంతోగొప్పవిగ;
తరతరంబులకు వ్యాపించునవి-తామరతంపరగ;
నియమముచేతనె స్త్రీలకుశక్తి-నెగడు మిగుల ఘనమై;

నియమము లేనిచో జాతియంతయు - నిర్వీర్యంబగును;
జాత్యభివృద్ధికి స్త్రీపవిత్రత యె - సాధనమై వెలయు;
అందువలననే స్త్రీలకెంతో నియ - మానుసరణి వలయు;
మూఢవిశ్వాసములని హేళన - మూఢులె చేయుదురు;
విచారించి చూచిననే స్వధర్మ - విశేషములు తెలియు;

వ॥ శ్రీవిద్యారణ్యుల బోధనవిని, ఉత్సాహభరితులైన సైనికులతో హరిహర రాయలు, బుక్కరాయలును.

అంతట నా సైన్యంబులతో బహ్మని - యవనీశుల గెలిచి
కన్నడ మైసూర్కళింగ నాగర - ఖండంబుల గెలిచీ
దక్షిణాపథమునంతను నిష్కం - టకము చేసిరండీ
అంతటకొన్ని శతాబ్దంబులవర - కా సామ్రాజ్యమ్ము
భారతధర్మపు పట్టుగొమ్మయై - ప్రబలియుండెనండీ
విజయనగర సామ్రాజ్యపుకీర్తి - వినుతికెక్కెనండీ

# ప్రబోధము

విద్యారణ్యుండమరజీవియై - వెలసినాడు ధరలో;
ఆమహనీయుడె భారతీయులకు - ఆదర్శనరుండు;
ఆయనబోధించిన స్వధర్మముల్ - ఆచరింపుడయ్యా;
వర్ణాశ్రమధర్మ పునరుద్ధరణ - భాగ్యము గనుడయ్యా;
అందరుల్ స్వధర్మపరులగుచును - ఐక్యతగనుడయ్యా
హిందూముస్లిము మైత్రినెంతయు - వృద్ధిపరచుడయ్యా!
భావిభారతాభ్యుదయ ప్రాప్తి - పదికవైచుడయ్యా;

# కృతజ్ఞత

భగవదనుగ్రహమున ముగిసిన ది-ప్పటికీ కథనమ్ము
శ్రీమచ్ఛివకుల అప్పయ్యాశాస్త్రి వ-రేణ్యులయానతిపై
శ్రీ నీలా రాజయ్యగుప్తగా-రి ప్రోత్సాహముపై,
రచించితిని శ్రీ॥ సాంబశివశ-ర్మాభిధానుడను,
స్వల్పజ్ఞుడనగు వాదోసంబుల-పాటింపకుడయ్యా,
భారత నాగరికతా మహిమనే-ప్రస్తుతింపుడయ్యా,
సుమహితభారత "దివ్యవాణి" దగు-శోభగాంచుడయ్యా!
భవ్యసికింద్రాబాదు పురమునను-వైశ్యకులాగ్రణియా
యశఃకాయ **చందా రామన్న** కు-అల్లుడైనవాడు,
రాజమాంబ శివరాజయ్యల ప్రియ-భాజనుడగు సుతుడు,
**శ్రీ పబ్బా శంకరయ్య శ్రేష్ఠి**-శ్రేష్ఠవర్తనుండు,
"శ్రీరామా బుక్ డిపో" అధిపతి,-శిష్టజనాదరుడు,
స్వసుతయా చిరంజీవి సౌభాగ్య-వతియా నాగమణి,
జన్మదినోత్సవ సందర్భంబున-సంతసంబుతోడ
ఈకృతి ముద్రింపించి ప్రకటించె-నెంత త్యాగధనుడో!
ఇట్టి సద్బుద్ధి ధనికులకెల్లను-ఈశ్వరుడిడుగాత!
శ్రీ శంకరయ్య దంపతులకు పు-త్రికా పుత్రులకును,
చిరాయురారోగ్యైశ్వర్యాదుల-శ్రీశుడిచ్చుగాక!

ప్రభువులు ప్రజలను ధర్మమార్గమున - పాలింతురు గాక!
గోబ్రాహ్మణ గణములకు శుభము చే-కూరుచుండుగాక!
సమస్తజనులును సుఖులై ధరలో - శాంతిగందురుగాక!

ధర్మో రక్షతి రక్షితః.



దివ్యవాణీ పత్రికవారి
శ్రీనివాస ప్రింటింగ్ వర్క్సు,
సికింద్రాబాదు.